ఈ సంచికలో



కవర్ : గోపి, రత్నాపూర్‌లో ఆత్రం అశోక్ ఎన్‌కౌంటర్ హత్యపై పౌరహక్కుల సంఘం నిజ నిర్ధారణ కమిటీతో వెళ్ళినప్పుడు ఆదిలాబాద్ అడవిలో డాక్టర్ రామనాథం.

సవరణ : గత సంచిక నెంబర్ 165–167 గా చదువుకోవాలి.


సృజన, హనుమకొండ–506 001 ఈ సంచిక రు. 3–00

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahitee Mithrulu'
Printed at A. P. Printers & Packagers, Hyderabad-500 001
for Venkataramana Mudranalayam, Warangal.

# సజీవ స్మృతిలో...

సరిగ్గా రెండు వారాల వ్యవధిలో సృజనకు ఆత్మీయులు ఇద్దరు అమరులయ్యారు.

సెప్టెంబరు 3 మంగళవారం ఉదయం పదిగంటలకు డాక్టర్ రామనాథం గారిని వరంగల్ జెపిఎన్ రోడ్‌లోని ఆయన క్లినిక్‌లో ఒక పోలీసు అధికారి రివాల్వర్‌తో కాల్చి చంపాడు. రామనాథం గారి వయసు 53 సంవత్సరాలు. దాదాపు ఇరవై ఏళ్ళుగా వరంగల్‌లో చిల్డ్రన్స్ స్పెషలిస్టుగా ప్రైవేట్ క్లినిక్ నడుపుతున్నాడు. వరంగల్ ప్రజా జీవితంలో ప్రముఖుడు. భార్య శ్రీమతి లక్ష్మి, కొడుకు శ్రీనివాస్.

సెప్టెంబర్ 18 రాత్రి ఎనిమిదిన్నరకు హైదరాబాద్ నర్సింగ్‌హోంలో గోపీ చనిపోయాడు. ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి కొరకు సెప్టెంబర్ 8 న శస్త్రి చికిత్స జరిగింది. కోలుకుంటున్నాడు. ఒకటి రెండుసార్లు దమ్ము వచ్చి ఊపిరాడడం కష్టమైనా నడిచాడు, మాట్లాడాడు, ఆహారం తీసుకున్నాడు. కుట్లు విప్పి డిస్చార్జ్ చేస్తారనుకుంటుండగా ఏడున్నర దాకా మాట్లాడుతూ ఉన్నవాడు రక్తపుపోటు పడిపోయి ఊపిరాడక కన్ను మూసాడు. వయస్సు ముప్పైనాలుగు. వరంగల్ ఎల్‌ఐసిలో పన్నెండేళ్ళుగా ఉద్యోగం. సహచారిణి అరుణ, పబ్లిక్ హెల్త్, హనుమకొండలో ఉద్యోగి.

షాక్ మీద షాక్ నుంచి సాహితీ మిత్రులింకా తేరుకోలేదు. డాక్టర్ గారు దాదాపు పదిహేనేళ్ళుగా 'సాహితీ మిత్రులు' ఉద్యమంలో భాగం. ఆయన సహాయ సహకారాలు, అండదండలు, సూచనలు, సలహాలు, పాత్ర లేకుండా ఈ పదిహేనేళ్ళ సృజన జీవితం లేదు.

గోపీ 1973 లో ఎన్‌కె ద్వారా 'సాహితీ మిత్రులు' ఉద్యమంలోకే కాదు నేరుగా నిర్మాణంలోకి వచ్చాడు. ఉస్మానియా క్యాంపస్‌లో చదువుకుంటున్న రోజుల్లో జార్జ్‌రెడ్డి ప్రభావం ఉంది. ఈ పన్నెండేళ్ళుగా నిర్వహణ, ముద్రణ మొదలుకొని అనువాద విభాగం వరకు గోపీ శక్తి సామర్థ్యాలు, ఊపిరి, ఊహలు సృజనను ఎన్నో గడ్డు రోజుల్లో బతికించాయి. విసుగు లేదు. నిరాశా నిస్పృహలు లేవు. ఆశావాది, జీవించడం, స్నేహం, ప్రేమ తప్ప ద్వేషం, అసూయ తెలియని వాడు.

సృజన జీవితాన్ని అర్థవంతం చేసిన ఇద్దరు సహచరులు అర్థాంతరంగా వెళ్ళిపోయారు. వాళ్ళ మెత్తని చిరునవ్వు, హృదయపు లోతుల మాట, త్యాగం, సేవ, సహకార భావాలు సాహితీ మిత్రులకు శక్తినిస్తూ సజీవ స్మృతిగా ఉంటాయి.

సంపాదకీయం :

# జీవన సంధ్యారాగం

మరణించిన పద్ధతి కాదు
శత్రువు మీద చేసే
యుద్ధాలనుంచి గ్రహించే సారం
ఒక మనిషిని యోధుణ్ణి చేస్తుంది.

యుద్ధ రంగంలో మరణించే వీరుడున్నాడు
ఆకలితో రోగంతో చనిపోయే వీరుడున్నాడు
ఏదో ఒక ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయే వీరుడున్నాడు
వృద్ధాప్యంలో కాలంచెల్లే వీరుడున్నాడు

ఎట్లామరణిస్తేనేం
చివరి శ్వాస వరకూ
ప్రజలకు సేవ చేయడమే
వీరుల సహజ లక్షణం

—జోస్ మారియా సిజన్

కన్నతల్లి ఒడిలో పాలు తాగుతున్న శిశువు కుడి నుంచి ఎడమకు మారడం వంటిది మరణం అన్నాడు రవీంద్రుడు.

జననం గురించి రాయాలనగానే మరణం గుర్తొస్తుంది నాకు. అయినా జననం ముదావహం. ఒకరు ఎట్లా మరణించారనేది ఒకరు ఎట్లా జీవించారనే దానికి దాఖలా అన్నాడు శ్రీశ్రీ.

జాతస్య మరణం ధృవం మొదలుకొని, సామాజిక గతి తార్కిక సూత్రాలు మనిషి మృత్యువుకు కూడ వర్తిస్తాయి అని చెప్పుకొనేంత వరకు

---

డాక్టర్ గారి కుటుంబానికి, అరుణకు సృజన తన హృదయ పూర్వక ప్రగాఢ సానుతాపాన్ని అందజేస్తున్నది. ఆ రెండు కుటుంబాల జీవితానందాన్ని పంచుకున్న సృజన వాళ్ళ విషాదంలో, కష్టాల్లో, ఆవి అధిగమించే కృషిలో కూడ పాలుపంచుకుంటుందని స్నేహపూర్వకంగా తెలియజేస్తున్నది.

అమరులు డాక్టర్ గారికి, గోపీకి జోహర్లు
ఈ సంచిక ఈ ఇద్దరి సజీవ స్మృతికి అంకితం.

మృత్యువు గురించి ఈ ప్రపంచంలో ఎంత జిజ్ఞాస, అన్వేషణ, ఆలోచన, విచికిత్స, తాత్విక సూత్రీకరణలు జరిగాయో చెప్పలేం.

అన్ని మతాచారాలూ, విశ్వాసాలూ పుట్టుకకు చేసినంత వేడుక, అట్టహాసం చావుకూ చేస్తాయి.

ఇంక విప్లవోద్యమమైతే మరణాన్ని అమరత్వం చేస్తుంది.

మరణించిన వ్యక్తి దైహిక ఆచరణ ఆ క్షణంనుంచి సామాజిక అవసరానికి ఇంక లభించదు అనే భౌతిక వాస్తవికతను మినహాయిస్తే అప్పటి వరకు ఆ వ్యక్తి సామాజిక ఆచరణ ప్రభావం భవిష్యత్తులో దాని పాత్ర అది నిర్వహిస్తుంది అనే అవగాహనే ఈ అమరత్వ భావనకు ప్రాతిపదిక. అంతేకాదు ఆ వ్యక్తి నిష్క్రమణ ఉద్యమంలో ఉన్నవాళ్ళకు ఆయన నిర్వహించిన సామాజిక బాధ్యతను అప్పగిస్తుంది.

మన చేతుల్లో వున్నది వెళ్ళిపోయిన వాళ్ళు అందించిన ఎర్రజెండా అనే విషయం, అది మృత వీరుల రక్తంలో తడిసి ఎగిరిన జెండా అనే విషయం వాళ్ళనెప్పుడూ మనమధ్య సజీవంగా ఉంచుతుంది.

కారంచేడులో భూస్వాములు ఆరుగురు దళితుల్ని హత్య చేసారు. అందులో డెబ్బై ఏళ్ళ వృద్ధుని నుంచి ఇరవై యేళ్ళ యువకుని దాకా హతులయ్యారు.

కారంచేడుకు ముందు వెనుకా భైరిగంగారాం కొండాపురం మొదలు చింతపల్లి, కోమట్ల దాకా బూటకపు ఎన్‌కౌంటర్ హత్యలు జరుగుతూనే వున్నాయి.

సూర్యుడు ఉదయించి సూర్యుడు అస్తమించి, నిద్రలేచి నిద్రపోవడమే జీవితంగా వున్న వాళ్ళ విషయంలో కూడ వృద్ధాప్య సహజ మరణం కానిది ప్రకృతి విరుద్ధంగానే కనిపిస్తుంది.

నీ ఊపిరికి నీ చుట్టువున్న గాలిమీద, నీ చూపుకు నీ చుట్టూవున్న పరిసరాలమీద, నీ మాటకు ఈ శబ్దమయ ప్రపంచం మీద, నీ నడుకకు చరిత్ర గతిమీద ప్రభావం వున్నప్పుడు నువ్వానాటి ఐలమ్మవో, ఇవ్వాటి జ్యోతివో అరవై అయిదేళ్ళ కవివో, అందులో అర్థాయుష్షులోనే పోయిన సాహితీ

మిత్రునివో, పౌర హక్కుల కోసం పోరాడిన కారంచేడువో, ఆ పోరాటం పక్షాన నిలిచిన డాక్టర్ గారివో, నువ్వు ఎవరై, ఎట్లా మరణించినా నీ మృత్యువు అది అమరత్వం.

అది విషాదాన్ని కలిగించే మధుర స్మృతి. అది విచారాన్ని మరపించే వీరస్మృతి. వీరుని మరణం కన్నీరు తెప్పించదని కాదు. కన్నీరు కారి పోతుంది. కర్తవ్యం ముందుకొస్తుంది. జ్ఞాపకాలు బరువై అవి ఆచరణలో గానీ మనసును తేలికపరచవు నిన్నటి దాకా వీళ్ళంతా మనలో, మనకోసం, మనతో పనిచేశారు. ఇవ్వాళ మనలో, మనకోసం, మనతో లేకుండా మనసులో వుంటారు. చార్జ్ చేసిన బ్యాటర్ శక్తి చీకటియినపుడు తెలిసొచ్చినట్లుగా వీళ్ళు మనలో ఎంత ఉత్తే జాన్ని రంగరించారో, ఆ జ్ఞాపకమే ఎంత బలమో మన ఆచరణలోగానీ మనకు తెలియదు.

మృత్యువుకేదైనా అంత స్వాత్రం వుందా? సామాజిక సందర్భం వుందా?

కారంచేడులో భూస్వాములు దళితులను హత్యచేసారు. సుప్రసిద్ధ బెంగాలీ కవి వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ కొన్నాళ్ళుగా క్యాన్సర్ వ్యాధితో బాధ పడుతూ అరవై అయిదో ఏట మరణించాడు. డాక్టర్ గారిని పోలీసు అధికారి కాల్చి చంపాడు. పాలకుర్తి ఐలమ్మ తన ఎనభైయో ఏట వృద్ధాప్యంతో మరణించింది.

ఒకరి మరణం వలె మరొకరిది లేదు. మరణమే సాధారణ లక్షణం. కాని మరణం కాదు ఇక్కడ సాధారణ లక్షణం. వీళ్ళందరి సామాజిక ఆచరణ వల్ల వీళ్ళ సంస్మరణ మనకు సాధారణ లక్షణం.

మనం అమృతత్వం విధించలేక పోవచ్చుగానీ, పాలకుర్తి అయిలమ్మను మరో అయిదేళ్ళో పదేళ్ళో బతికించుకోగలుగుదుమో లేదో కాని మన ఇష్టాలకు, నిర్ణయాలకు పూర్తి విరుద్ధంగా, అన్యాయంగా, దుర్మార్గంగా పై వాళ్ళందరినీ ఈ వ్యవస్థ చంపేసింది. ఇది హంతక వ్యవస్థ, క్యాన్సర్ వ్యవస్థ, పోలీసు వ్యవస్థ ఊపిరాడనివ్వని వ్యవస్థ.

ఈ వ్యవస్థను ధిక్కరించలేకపోతే నీవు మృత్యువును ధిక్కరించలేవు.

జీవించే ఆకాంక్ష పోరాడే ఆచరణగా మారినపుడు మృత్యువును పరిష్కా రంగా ఎంచుకుంటుంది ఈ హంతక వ్యవస్థ. బానిసగా పడివుండడమే బ్రతికి

ఉండడం అని నమ్మించిన యజమానీ, నమ్మిన బానిసా తిరుగబడ్డ బానిస మరణం నుంచి జననం ప్రారంభమైందని గ్రహించలేరు.

నిన్న విడిచిన పోరాటం నేడు అందుకున్నప్పుడు నిన్న జీవించిన వాళ్ళ మరణం ఇవ్వాటి సామాజిక ఆచరణలో భాగమవుతుంది. అందువల్లనే మంచి వాళ్ళ మరణం ఎన్ని కన్నీటి తెరల్ని సృష్టిస్తుందో, ఆ తెరల వెనుక ఆ మంచి తనపు ఉత్తేజకర దృశ్యం మననంతగా మంచి నిర్ణయాల వైపు, కర్తవ్యాలవైపు పురికొల్పుతుంది. బాధ, ఆదర్శం కలగలిసిన సంస్మరణ వల్లనే వీరులు మృత్యుంజయులవుతున్నారు.

విరుద్ధ అంశాల మధ్య సంఘర్షణ సారం జీవనమైతే ఆ ఘర్షణ ఆగిపోవడం మృత్యువు. ఆ ఘర్షణ ఆగిపోవడం అనేది మొత్తం సామాజిక ఆచరణకు సంబంధించిన అభివృద్ధి క్రమంలో భాగంగా చూస్తే ప్రజలకొరకు జీవించిన వాళ్ళ మరణం మైలు రాయిలా నిలిచిపోతుంది.

కారంచేడు మృతవీరులు భూస్వామ్య వ్యవస్థకు పొలాల్లోని బురదలో తమ నెత్తురు కలిపి పునాదుల్నించి సమాధి కట్టుకొంటున్నారు. పౌర, ప్రజా హక్కుల ఉద్యమంలో డాక్టరుగారు, సృజనలో గోపీ సజీవంగా వున్నారు. నేటి తెలంగాణా నాటి తెలంగాణా ఐలమ్మను వెతుక్కుంటూ వెళ్ళి వెంట తెచ్చుకున్నది. కవిత్వ దీప స్తంభాలలో వీరేన్‌కు వీడ్కోలు చెప్పి ఆయన కవిత్వపు వెలుగును కంట్లో నిలుపుకున్నది కలకత్తా.

బూటకపు ఎదురు కాల్పులలో ప్రజల మనుషుల ప్రాణాలు పోతున్న మాట నిజమే కాని ఇవి ఎల్లకాలం కోసం ఎదురులేని కాల్పులు కాజాలవనేది మృత్యువు కూడ జీవితానికి గతి తార్కిక ముగింపు అని మావో తాత్వికంగానూ శ్రీశ్రీ కళాత్మకంగానూ చెప్పిన మాటలో వున్న చారిత్రక సత్యం.

ప్రజల కోసం మరణం హిమాలయాలకన్నా ఉన్నతం ఎందుకవుతుందంటే అంత ఎత్తు మీంచి చూడగలిగితే భూమి, దేశం, చావు, బ్రతుకు ఏదీ పరిమితంకాదు, దీనికి ఎల్లలు లేవు, ఏదీ ముగింపుకాదు, ఏదీ వయ్యక్తికంకాదు.

ఎవరి అనుబంధపు కన్నీళ్ళను పదిమంది పంచుకుంటారో అది మరణం కాదు. రణవిరామజ్ఞాపక చిహ్నం. రేపటి జీవన సంగ్రహానికి ఎత్తిన స్మృతి కేతనం. అందుకే ముంగిటిలో వినిపిస్తున్నది. మృత్యుఘంటిక కాదు. జీవరవళి.
నవజీవన కాహళి. 7-10-1985

# సత్యాన్వేషణకు సవాల్

'చీమా చీమా ఎందుకు కుట్టినవు?'
'నా పుట్టలో వేలు పెడితే మరి కుట్టనా?'

చీమను ఎందుకు కుట్టావని అడుగుతుంది తప్ప మన న్యాయం చీమ పుట్టలో వేలెందుకు పెట్టావు అని అడగదు. పామూ పామూ ఎందుకు కాటేసావు అని అడగదు. పైగా పాము తోక తొక్కినా, పడగ మీద కొట్టినా పగబట్టి కాటేస్తుంది గనుక, పుట్టలో పాలు పోసి పూజ చేయమంటుంది. ఆ పుట్ట కూడ దానిది కాదు- చీమలు పెట్టిన పుట్టలే పాములకిరవయ్యాయి అని తెలిసీ పాము రాజ్యానికి భయపడుతుంది.

కారంచేడు సద్దుమణిగాకనయినా ఒక ప్రశ్న పైకి వస్తే ఆశ్చర్యపడ నక్కరలేదు. అవిటివాడు భూస్వాముల కుట్రవాణ్ని ప్రశ్నించకపోతే, సువార్తమ్మ బిందె అడ్డం పెట్టకపోతే, లేదా తనను కొట్టనివ్వకుండా చర్నాకోల కొస అందుకోకపోతే ఇంత 'ఘర్షణ' తప్పేది గదా! ఏమొచ్చిది - మాటకు మాట వల్ల, ప్రశ్నించడం వల్ల, ప్రాణాలు పోయి, మానాలు పోయి, మాన్యాలు పోయి, ఎంత హైరానా పడవలసి వచ్చింది, తిట్టబోయిన దురహంకారాన్ని ప్రశ్నించడమా, కొట్టబోయిన కొరడా కొస పట్టుకొని ఆపడమా - అనే ప్రశ్నలను కూడ స్వీకరించే చివరన ఉన్నవాడు ఆస్తిపరుడా కాదా అనే అంశం మీద మన జవాబులు ఆధారపడి ఉంటాయి.

వ్యవసాయ కూలీకి పత్రికల్లో రాయదగిన మధురమైన జీవితమే లేదు. ఈ భూమ్మీదికి వచ్చాడు గనుక కన్న తల్లి ఉంది గానీ ఏంచూసి ఎవడైనా పిల్లనిస్తాడు?! పెళ్ళే లేనపుడు పెళ్ళాం ఒడిలో కళ్ళు మూసే విషాదమైన వీడ్కోలు లేదు. ఎక్కడో నాగరికారణ్యంలో మృగం గిట్టల కింద చీకట్లో చచ్చిపోతాడు. 'కన్న తల్లికి పీడకలలో పేగు కదులుతుంది'. మహాకవి కవితా చరణం మీద అందులో కవిత్వం ఉంది గనుక మనకు మక్కువ, గౌరవం కానీ ఆ కన్నతల్లి అనామకురాలు. ఆమె సెంటిమెంటు, అదీ సెంటిమెంటేనా - సెంటెడు భూమయినా లేని వారి సెంటిమెంటు కోసం మన మనసుల్లో సెంటీ మీటరు జాగా కూడ ఉండదు. భూమి జాగలున్నవానికి మనసులో జాగా ఇస్తాం గానీ బుక్కాఫకీర్ గానికి ఇస్తామా?

చింతపల్లి అడవుల్లో అయిదుగురికి పట్టుకున్నారు. వాళ్ళంతా ఒక విప్లవ పార్టీ దళ సభ్యులు. భూమి లేని ప్రజల తరఫున రాజ్యం మీద ప్రజా యుద్ధం ప్రకటించి సాయుధులయ్యారు. ప్రజల్ని సమీకరించి సంఘటితపరిచి చైతన్య వంతం చేస్తున్నారు. పోనీ, గిట్టనివాళ్ళు, వీళ్ళవల్ల నిర్బంధాలు తమకు చుట్టు కుంటున్నాయని అనుకునేవాళ్ళు వాపోతున్నట్లు ప్రజాయుద్ధం పేర 'హింసా రాజకీయాలకు' ఎగబడ్డవాళ్ళు. ('ఇగ ఎగబడదామురో ఎములాడ రాజన్న మనం' అని చెప్పినపుడు ఎగబడడం ఒక అపురూప పదార్థం కాదు- ఎగ బడాలని సంకల్పించి ప్రారంభిస్తే అది ఎక్కడికి పరిణమిస్తుందో మనం కాదు శత్రువు నిర్ణయిస్తాడు అని వాళ్ళు చెప్పలేకపోవచ్చుగాని తత్వ శాస్త్రంలో మార్క్స్, లెనిన్, మావోలు, కథల్లో రావిశాస్త్రి వంటి వాళ్ళు చెప్పే ఉన్నారు. వీళ్ళు చెప్పిందీ హింసా వాదమే అయితే అసలు తప్పు పట్టాల్సింది తిరుగు బాటును, తిరుగుబాటు సిద్ధాంతాన్ని. భగవద్గీత మొదలు భజన పార్టీల దాకా చేస్తున్న పని అదే. 'కర్మ'కు వ్యతిరేకంగా, అంటే ఆస్తికి వ్యతిరేకంగా మానవ ప్రయత్నమే నేరమని సిద్ధాంతీకరించారు వాళ్ళు.)

అయినా ఈ అయిదుగురు అప్పటిదాకా ఏ హింసా రాజకీయాలు ఆచరించిన దాఖలా లేదు. అందులో జ్యోతి అనే రాజేశ్వరి ఆదివాసీ యువతి పారిపోతే భర్తను కాల్చేస్తామన్నారు. ఆ నలుగురిలో తన భర్త లేడని ఆమె గమనించలేదు. అతని ప్రాణాలకోసం ఆగింది. ఆమె ప్రాణాలతో పాటు అయిదు గురి ప్రాణాలు తీసారు. చిత్రహింసలు పెట్టి తీసారు. పద్దెనిమిదేళ్ళ యువతి - పార్టీలోకి వచ్చాక వివాహం చేసుకున్నది. గలగలా సముద్రం అలవలె నవ్వు తుంది. సముద్ర కెరటంవలె గెంతుతుంది. ఆ ప్రకృతంత స్వచ్ఛమైంది. తన ప్రాణం చూసుకోలేదు. భర్త ప్రాణం కోసం మృత్యువు మాటనమ్మింది. ఆమె గురించి ఏ సెంటిమెంటుకూ ఆ దట్టమైన అడవిలో తావు లేదు. ఆ అడవిలోని వెదురు బొంగు నరికించుకొని ఆ దరువుకు తగిన కూలిరేట్లు కూడ ఇవ్వక రాజమండ్రి పేపర్ మిల్లుకు తోలుక పోయే లారీలు దగ్ధమైతేనో, కంట్రాక్టరు కాళ్ళు చేతులు విరిగితేనో ఫెర్నాండెజ్ దగ్గరా, కాణోజీ దగ్గరా హింసా రాజ కీయాల గురించి తల్లడిల్లిపోయి బరువైన డైలాగులు చెప్పిన ముఖ్యమంత్రికి ఈ అయిదుగురివి ప్రాణాలూ కావు, ఆ ఆదివాసి తెలుగు ఆడపడుచూ కాదు. ఆ అడవిలో ఆవాసం చేస్తున్న వాళ్ళే గాని ఆ అడవిమీద అధికారం ఉన్నవాళ్ళు కాదు వాళ్ళు. ఇప్పుడా అధికారం కావాలంటున్నారు. అదే సమస్య.

ఆస్తి హక్కూ, భావ ప్రకటనా, సంఘ నిర్మాణ హక్కు ప్రాథమిక హక్కులుగా రాజ్యాంగంలో పొందుపరిస్తే ఒక కృత్రిమ హక్కును ప్రశ్నిస్తూ

ఒక నైసర్గిక హక్కు ప్రకటించిన యుద్ధం ఇది. ఆస్తిగలవాని పక్షాన పేద పోలీసు తుపాకీ పడితే అది విధ్యుక్త ధర్మం అవుతుంది. భూమి లేని నిరుపేదకు భూమి కోసం అడితే పౌర హక్కు, భూమికోసం; పోరాడే ప్రజాతంత్ర హక్కు ఉన్నాయని డాక్టరు గారు అంటే అది హింస అవుతుంది. డాక్టరు గారి వృత్తి, ఆయన పని చేస్తున్న సంఘం - అన్నీ అమలులో ఉన్న సాంఘిక మర్యాదలకు, రాజకీయ చట్టాలకు లోబడినవే అయినప్పటికీ - ఆయన భూమి లేని నిరుపేద గురించో, వ్యవసాయ కూలీ గురించో ఎందుకు ఆందోళన పడుతున్నాడనేది 'భద్ర' లోకానికీ, 'సభ్య' ప్రపంచానికీ అభ్యంతరకరమైన విషయం.

ముందు మన శాస్త్రాలు, సాహిత్యం నిండా, ఇప్పుడు మన చట్టాలు, ప్రచారం నిండా దొంగలు, బందిపోట్లు, ఖూనీకోర్లు, దౌర్జన్యపరులు ఎవరయ్యా అంటే పేదవాళ్ళు. వాళ్ళు తిండికోసం దొంగతనాలు చేస్తారు, నేరాలు చేస్తారు, ఖూనీలు చేస్తారు. తమ తిండి గురించి కాదు తరతరాలకు తరగని ఆస్తికోసం - ఆస్తులు కూడ ప్రకటించకుండా అసెంబ్లీలో ధర్మపన్నాలు చెప్పి సన్యాసం నటించే వాళ్ళు - రాజ్యం చేస్తారు. దొంగలు, బందిపోట్లు, ఖూనీకోర్లు, దౌర్జన్య పరులను అణచడానికి చట్టాలు చేస్తారు. ఆస్తులు, చట్టాలు, శాస్త్రాలు ఒక వర్గం పరంగా ఉన్నాయి గనుక అసలు కీలక సమస్య రాజ్యాధికారానిది అని గ్రహిస్తే 'చట్టాన్ని చేతిలోకి తీసుకుంటారా? ఇట్లయితే స్టేట్ ఏమయిపోవాలి?' అని గగ్గోలు పెడతారు.

ఈ చట్టాలను తుంగలో తొక్కి కారంచేడు పొలాల్లో బురదలో తొక్కి మానవ శరీరాలపై పైశాచిక నృత్యం చేస్తూ కత్తులతో బరిసెలతో ప్రాణాలు తోడిన భూస్వాములకు ఆ బురదమీద, ఆ బురదలో పుట్టి, బురద బుక్కి, బురద తొక్కి పని చేసిన మనిషిమీద, అతని ప్రాణాలమీద, భూమిమీద, వేలాది ఎకరాల సముద్రతీరం మీద అధికారం ఉంది. కనుక చట్టం ఉన్నదే అతని చేతిలో. చట్టం తమ చేతుల్లోకి తీసుకోవడం అనే సమస్య ఎక్కడిది? అతని చేతుల్లోనే ఉన్న చట్టాన్ని రోజులూ నెలలూ గడిచినా 'నేరస్తులను పట్టుకొని శిక్షించాలి' అని దేబరించడమా - ఈ నేరానికి మూలమైన భూమిమీద అధికారం ప్రకటించడమా - అన్నదే ఐక్యనగర్‌లో ఉండి విజయం వైపు చూస్తున్న వాళ్ళ ముందున్న ప్రశ్న. ఇది తీగ లాగితే డొంకంతా కదిలే ప్రశ్న ఉంటే, 'ఆ బర్రెను కడిగిన నీళ్ళు మంచినీటి చెరువులోకి ఎందుకు రానిస్తావయ్యా' అని అడగకుండానైనా అవిటివానిగా పడి ఉండు. 'ఆ అవిటివాణ్ని ఎందుకు కొడతావయ్యా' అని అడగకుండా 'ఆడదాని'గా, అదనా మాదిగ ఆడదానిగా

పడి ఉండు. లేదా, ఆరుగాలం ఇసుక రేణువులు సేకరించి పుట్టలు పెట్టి, గింజ గింజ ముక్కున కరచి పోగుచేసింది నేను, ఇవి పాములకు ఎందుకు వదులు తాను అని ప్రకటించు. అయితే ఈ ప్రకటన ఆచరణ రూపం పొందుతున్న ఆరంభం నుంచీ రాజ్యం విరుచుక పడుతుంది. అన్ని మర్యాదలూ నియమాలు మట్టి గరుస్తాయి. హింస విశ్వరూపమెత్తుతుంది.

ఇవ్వాళ కరీంనగర్ జిల్లాలో జరుగుతున్నట్లు గ్రామాలకు గ్రామాలను బందెల దొడ్లుగా మార్చి వందలాది మంది మీద పాశవిక హింసను అమలు చేస్తారు. ఇండ్లు కూలగొడతారు. ధాన్యం, కిరసనాయిలు కలిపి బావిలో పార బోస్తారు. పంట పొలాలను పశువులతో తొక్కిస్తారు. గ్రామాల్లో వృద్ధులూ స్త్రీలూ తప్ప మిగలని స్థితిని కల్పిస్తారు. వరంగల్ జిల్లాలో జరుగుతున్నట్లు గాంధీ విగ్రహాల చుట్టూ స్త్రీ పురుషులను నగ్నంగా పరుగెత్తిస్తారు. ఎక్కడో ఏటూరు నాగరం సంఘటన గురించి వరంగల్ పట్టణాన్నే అరెస్టు చేస్తారు. నాగాలాండ్ మిజోరాంలవలె ఉద్యోగులకు, విద్యార్థులకు గుర్తింపు కార్డుల నిర్బంధం అమలు చేస్తారు. పెద్దపల్లిలో మృతవీరుల స్థూపాలను కూలగొడుతారు. నిజామాబాద్ జిల్లాలో జరుగుతున్నట్లు నక్సలైట్లను చంపిన "ప్రజలకు" భారత శిక్షాస్మృతి వర్తించదు, అది హత్యానేరం కిందికి రాదు అని భరోసా ఇస్తూ ఆ నక్సలైట్ల బొమ్మలు పత్రికల్లో సినిమాల్లో ప్రకటిస్తారు. గోదావరి, విశాఖ జిల్లాల్లో జరుగుతున్నట్లు పచ్చని అడవి మీదికి పరదేశం నుంచి ఖాకీ దండు వచ్చినట్లు కోంబింగ్ ఆపరేషన్ జరుగుతుంది. ఒక ప్రాణానికి ఐదు ప్రాణాలు తీస్తారు.

నడుములకు తూటాల బెల్టులు, వేళ్ళాడే రివాల్వర్లు, కప్పుకున్న షాలువా చాటున పిస్టళ్ళు, బులెట్ ప్రూఫ్ జాకెట్లు తొడుక్కొని జీపుల నిండా, బంగ్లాల నిండా బాంబు పాతర్లు, సాయుధ బలగాలు పెట్టుకున్న శాసన సభ్యులు శాంతి భద్రతల కోసం సరిహద్దులు మూయాలనీ, హెలికాప్టర్లతో అడవులపై, లోయలపై బాంబుల వర్షం కురిపించాలనీ, టెర్రరిస్టు చట్టం తేవాలనీ, ప్రజా సంఘాలనూ పౌర హక్కుల సంఘాలనూ నిషేధించాలనీ, ఈ అణచివేత చర్యలు చాలవనీ కాళ్ళ కింది భూమి కరిగిపోతున్నంత గాభరా ప్రదర్శిస్తారు.

అటు నక్సలైట్ల హింసకూ, ఇటు పోలీసుల హింసకూ మధ్యన ప్రజలు నలిగి పోతున్నారని వెనుకటికి హోచిమిన్ జాన్సన్‌ల వియత్నాం యుద్ధానికి వియత్నాం అమెరికాలలోని యువకులు బలి అయిపోతున్నారని 'మానవతా'

ఆవేదన ప్రదర్శించిన కవి వలె కొందరు 'బ్యాలెన్సింగ్'గా రాస్తారు. 'మరి వీళ్ళు చంపినపుడో' అని కొందరు బండగా తెగేసి అడుగుతారు. ఇదెక్కడి ఆటవిక న్యాయం, కంచే చేను మేస్తే ఎట్లా, చట్టాలను అమలు చేయాల్సిన వాడు, కాపాడాల్సినవాడే చట్టాలను పట్టపగలు ఉల్లంఘించి కంటికి కన్ను, పంటికి పన్ను సిద్ధాంతం అమలు చేస్తే ఎట్లా అని ఎవరైనా పార్లమెంటరీ ప్రజా స్వామ్యపు చాదస్తంతో ప్రశ్నిస్తే వాళ్ళు నక్సలైట్లో, టెర్రరిస్టులో, సి. ఐ. ఎ. ఏజెంట్లో అవుతారు.

ఇంతవరకు కథ పాతదే. అది ఇక్కడ ఆగదు. వాళ్ళు బ్లాక్ మెయిల్‌కు గురవుతారు. నక్సలిజాన్ని టెర్రరిజాన్ని బలపరచి, నక్సలైట్, టెర్రరిస్టు హింసకు బాధ్యులుగా రాజ్యం హింసకు బలి అవుతారు.

నీ నిజ నిరూపణ కమిటీ రిపోర్టులో ఫలానావాడు ఫలానా 'ఎన్‌కౌంటర్' హత్యకు కారణమన్నావు, ఫలానా లాకప్ హత్యకు బాధ్యుడన్నావు. అతణ్ని నక్సలైట్లు చంపేసారు. ఢిల్లీ మారణ కాండకు ఫలానా వాళ్ళు బాధ్యులన్నావు. వాళ్ళను టెర్రరిస్టులు చంపుతున్నారు.

మీ రిపోర్టులు వాళ్ళ హిట్ లిస్టులు అంటున్నది రాజ్యం.

ఇది ఆంధ్రప్రదేశ్‌లో 'ఆపరేషన్ రెడ్‌స్టార్' పేరుతో పోలీసులు సాగిస్తున్న ప్రచారం మొదలు దాదాపు అన్ని పార్లమెంటరీ పార్టీలు, మరీ ముఖ్యంగా బిజెపి, సిపిఐ (ఎం), ఎంసిపిఐ, వాటి అనుబంధ సంస్థలు చేస్తున్నాయి. కేంద్రంలో కాంగ్రెస్ (ఐ), పోలీసులు చేస్తున్నారు.

మనం ఇదివరలో తప్పు చేసిన వాణ్ణి బ్లాక్‌మెయిల్ చేయడం గురించి విన్నాం. ఇప్పుడు స్వచ్ఛంద సంస్థల, పౌర, ప్రజాతంత్ర సంస్థల సత్యా న్వేషణను బ్లాక్‌మెయిల్ చేస్తున్నారు. ఎవరో కాదు, పాలకవర్గాలు. ఎందుకు? భూమి, భుక్తి, విముక్తికోసం పోరాడుతున్న ప్రజల పక్షానవాళ్ళ పోరాటంతో ఏకీభావం ఉన్నా లేకున్నా-వాళ్ళకు పోరాడే హక్కు ఉందని నువ్వు అనకుండా చేసేందుకు నిన్న నిర్బంధంతో, దాడి, దుష్ప్రచారాలతో మొదలై ఇవ్వాళ హత్యల దాకా పోయింది ఈ పాలకవర్గాల బ్లాక్‌మెయిలింగ్.

అల్లూరి సీతారామరాజు నుంచి, తెలంగాణ, శ్రీకాకుళాల దాకా ఈ దుష్ప్రచారాలు, నిందలు, నిర్బంధాలు, దాడులు, హింసలు ప్రజలకూ అను

భవంలోనివే, రాజ్యం స్వభావంలోనివే. పాలకవర్గాల హింసను ప్రజల హింసగా చిత్రించగల వనర్లు, సాధనాలు, సిద్ధాంతం దాని చేతిలో వేల సంవత్సరాలుగా ఉన్నాయి. అన్నిటికన్న మించి అనుకూలంగా చేతిలో రాజ్యాధికారం ఉంది. అది మరచిపోయి ప్రజల హింస గురించి గుండెలు బాదుకోవడం అమాయకత్వమో, భయమో, ధూర్తత్వమో అవుతుంది. ఇంతకూ ప్రజల హింస ఎవరిమీదని ?!.

ప్రజలు హింస చేస్తారా ? హింసా సాధనాలు వాళ్ళ చేతుల్లో ఉన్నాయా ? హింసా స్వభావం వాళ్ళ చైతన్యంలో ఉందా అనేది మౌలిక సమస్య. ప్రజలు, అందులో ముఖ్యంగా భారతదేశంలో ప్రజలు శాంతి స్వభావులు అని చెప్పడం అందరికన్న ఎక్కువగా బూర్జువావర్గాలకు చాల ఇష్టం. అయితే అణచివేత, దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజలు తమ బాధ, కోపం, కసి, ప్రతీకార భావాలను ప్రతిఘటనగా, ప్రతి హింసగా, విప్లవ హింసగా మలచుకున్నారని 1857 కన్న ముందు నుంచీ స్పష్టాస్పష్టంగానైనా రైతాంగ పోరాటాల చరిత్ర రుజువు చేస్తున్నది. ప్రజలు వర్గపోరాటంలో చైతన్యవంతులయ్యే క్రమంలో రాజ్యం హింస - పద్ధతి, పథకం, కుట్ర ప్రకారం జరిగినట్లుగానే (అరాచకంగా కాదు రాచకంగానే), ప్రతిహింస కూడ అక్రమంగా కాదు క్రమంగానే జరుగుతుంది. (అక్రమంలోనూ క్రమం వుందని ప్రకృతి సూత్రాలు వివరిస్తాయి).

మార్క్సును ప్రమాణంగా పేర్కొంటూ రాజ్యం హింసను ప్రభుత్వ హింసగా మాత్రమే అర్థం చేసుకునేవాళ్ళు చరిత్రను కూడ ఒక ప్రాసెస్‌గా కాకుండా గతంగానే గుర్తుపెట్టుకుంటారు. అట్లా గుర్తుపెట్టుకునేవాళ్ళు కూడ భగత్‌సింగ్‌దాకా కూడ వెళ్ళనక్కరలేకుండా, తెలంగాణ, శ్రీకాకుళాలు (శ్రీకాకుళానికి ఒక సిద్ధాంతం ఉందని ఇప్పటి పోలీసు మంత్రి సర్టిఫికెట్ ఇస్తున్నాడు. అప్పటి పోలీసు మంత్రి ఏమంటాడో !) విజయవంతమైన విప్లవాలు కావు గనుక వాటి జోలికి పోకుండా, దీర్ఘకాలంపాటు సాగి ఈనాడు భారత రైతాంగ పోరాటానికే కాదు, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలకు కూడ ప్రజాయుద్ధ పంథాను అందించిన చైనా విప్లవ చరిత్రను గుర్తు చేసుకొని ఆలోచించడానికి సాహసిస్తారా ?.

1-10-1985

# చిన్నబోయిన తోట నీ చిరస్మరణలో చిగురించులే....

చెట్ల గూళ్ళలో కళ్ళు తెరుస్తున్న కూనల్ని
కాటేయకుండా కాపలా కాస్తున్నాడని
పగబట్టి కాటేసింది తోటమాలిని విషప్పురుగు.

ఆయన చిరునవ్వు తోటకు వెలుగు
ఆయన స్పర్శ చిగుళ్ళ తెగుళ్ళకు మందు
తన నెత్తుటి శ్వాసలతో
తోటకు రంగూ రూపం ప్రాణం తెచ్చాడాయన
వ్రణానికి ప్రాణం శత్రువు
విషానికి విరుగుడు శత్రువు



బాల సూర్యరశ్మి
నవకిసలయ పరిమళం
నెలవంక చిరునవ్వు
సెలయేటి మధురిమ
తన స్పర్శతో తెచ్చే మందానిలం
పాము పడగ నీడలో
వడలి పోకుండా
విషాక్తమవకుండా
కంటికి రెప్పలా
కాపు వేసాడాయన
తోటలో ఆడుకునే పిల్లలకు
దెబ్బ తాకినా ముల్లు గుచ్చినా
కట్టు కట్టాడు
పురుగో బూచో పారితే భయపెడితే
వెన్నుతట్టి ధైర్యం చెప్పాడు

ముళ్ళు సెలిగి గట్టుల్ని పుట్టల్ని
చదును చేయకుండా
తీగెకూ చెట్టుకూ పాదు కాదని
చెప్పడమే నేరమైంది

చీమలు పెట్టిన పుట్టల్ని
కోటలుగా ఏలుకుంటున్న కూటనీతి
తోటమాలిని కాటేసింది

తోటమాలి స్వేదంలో
చిగురించిన తోట
తోటమాలి త్యాగంలో
పుష్పించి నివాళిస్తుంది

స్నేహానికి వేగాన్ని ఇచ్చినట్లుగానే ఉద్యమం స్నేహం గురించి చెప్పుకోవడానికి స్పీడ్ బ్రేకర్లను కూడ అమర్చినపుడు వ్యక్తిత్వాలను చెప్పలేని మాటల్లో వెతుక్కోవాలి.

సెప్టెంబర్ 3. డాక్టర్ గారిని పోలీసులు కాల్చేసారు. సెప్టెంబర్ 4. ఆ భౌతిక కాయాన్ని మేం కాల్చివేసాం. రోజులు గడిచిపోతున్నాయి. వేణురావు తోటలోని ఆయన ఇంటిమీద, జెపిఎన్ రోడ్‌లోని ఆయన క్లినిక్ ముందూ తెల్లవారుతున్నది. పొద్దు గూకుతున్నది. అయన హత్యకు సాక్షి సూర్యుడు దోషిలాగా రోజూ ఉదయం తాళం వేసి ఉన్న ఆయన క్లినిక్ ముందు స్వచ్ఛంగా పొద్దుటెండలాగా అంతా కనిపిస్తూ ఏమీ చెప్పలేక తచ్చాడి తచ్చాడి వెళ్ళిపోతున్నాడు. ఎవరి దినచర్యా ఆగకపోవచ్చు. 'మా పిల్లలు సెలవివ్వరుగదా' అని ఈ రోగ వ్యవస్థమీద చిరునవ్వుతో జోక్ వేసే డాక్టర్ గారు ఆ పిల్లల్నందరినీ వదిలి వెళ్ళిపోయారు. జబ్బులను నయంచేసే పనికాకుండా జబ్బులకు మూలాన్ని రద్దుచేసే పనికి పూనుకుంటానంటే జబ్బులమీదనే బతుకుతున్న వ్యవస్థ క్షమిస్తుందా ?

నిజానికి ఈ విషయం మీద చర్చలోనే డాక్టర్‌గారితో పరిచయం పెరిగి స్నేహంగా మారింది. అలోపతిక్ మందుల పట్ల మాటల్లో, చేతల్లో నేను వ్యక్తం చేసిన కంసెప్ట్ నాలో ఆయనకు ఆసక్తిని రేకెత్తించింది. కవిత్వం మొదలు సాంస్కృతిక విప్లవం వరకు ఒక తీరికలేని డాక్టర్ తీరిక సమయాల పాస్టైమ్స్ కాకుండా నిజమైన జిజ్ఞాస కనబరచడం క్రమంగా పనుల దగ్గరనే మా పరిచయం ఆగకుండా చేసింది.

చందా కాంతయ్య స్మారక కళాశాలలో ఉద్యోగం కోసం నేను చదువుకున్న ఆర్ట్స్ కాలేజ్‌లో ఇంటర్వ్యూకు పోయినరోజు ఇంటర్వ్యూ అయిపోయాక రెండు విషయాలు విన్నాను. అది 1968 సెప్టెంబర్. వరంగల్‌లో ప్రత్యేక తెలంగాణ ఆందోళన రగుల్కొంటున్నది. ఈ ఇంటర్వ్యూల మీద కూడ దాని

ప్రభావం ఉంటుంది. మా ఇంటర్వ్యూ జరిగిన రోజేనో, ఆ ప్రాంతాల్లోనో వరంగల్‌లో తరిమెల నాగిరెడ్డి మీటింగు ఉంది. ఆయన 'అసెంబ్లీ అనే సాలె గూడు' నుంచి బయటికి వచ్చి నక్సల్బరీ శ్రీకాకుళ ఉద్యమాలకు ప్రజా సంఘీభావాన్ని కోరుతూ తిరుగుతున్నాడు- అని. అప్పటికే జిల్లా రచయితల సంఘం సభల్లో పట్టుకొని కాకతీయ మెడికల్ కాలేజ్ విద్యార్థులు నాకు సృజనలోని రచనలమీద 'క్లాస్' తీసుకున్నారు. 'రక్తచలన సంగీత శ్రుతి'కి సంజీవదేవ్ రాగరేఖలకూ ఉన్న అసంబద్ధతకూ ఆధునిక వేదికయా సృజన అని సూటిగా ప్రశ్నించారు. అయినా ఎస్వీ రామారావు 'బెజవాడ దగ్గరి కృష్ణ' తోనే పునః ప్రవేశించింది వరంగల్‌కు సృజన. బెజవాడ దగ్గరి కృష్ణవలె వరంగల్ దగ్గర గోదావరి ఉండడం సాధ్యం కాదని గ్రహించడానికి సంచిక కాలం కన్న ఎక్కువ పట్టలేదు సృజనకు- వరంగల్ ఆహ్వానం 'ట్రిగర్ మీది వేళ్ళతో రమ్మ'ని. శ్రీకాకుళం అర్థమైనంత బాగా అప్పటికి సృజనకు తెలంగాణ అర్థం కాలేదు. పైగా త్వమేవాహమ్‌లో మహేంద్రోదయంలో, శ్రీశ్రీలో ప్రజల్లో కన్న ఎన్నోరెట్లు ఎక్కువగా సౌక్కి ఉన్న నేను ఆరుద్ర కవిత కత్తిరించి వేసి అటు ఆయన కోపానికీ, ఇటు అవగాహనా లోపానికీ గురయ్యాను. అప్పుడు నా దృష్టికి వచ్చింది. వరంగల్‌లోని సోషలిస్టు యూత్ లీగ్. వీళ్ళు తెలంగాణ సమస్య మీద మార్క్సిస్టు దృక్పథంతో కరపత్రాలు, బుక్‌లెట్స్ తెస్తున్నారు. వెతుక్కుంటూ వెళితే ఈ యువకుల వెనుక ఒక వృద్ధుడు ఉన్నాడు, శాస్త్రిగారుగా మాత్రమే అప్పుడు పరిచయం. మహబూబియా స్కూల్లో టీచరు. రావ్స్ ఆటో వర్క్సులో తీరిక వేళల్లో లెక్కలు రాస్తాడు. మహానందేశ్వర శాస్త్రి, 'మహేశ్' పేరుతో నలబైలలో త్రివేణి ప్రచురణలుగా తొలిసారిగా ఆచరణ, వైరుధ్యాలు (మావో), కొడుకులు-కూతుళ్ళు అనువదించి ప్రచురించిన వాడు. కమ్యూనిస్టు పార్టీ అనువాద ప్రచురణ విభాగాల్లో పనిచేసిన వాడు. ఆయన చుట్టూ ఆనాడున్న యువక బృందంలో అప్పటికి ముప్పై అయిదు దాటినవాడు ఒక్క డాక్టర్‌గారే. శాస్త్రిగారు డాక్టర్‌గారితో సృజనకు చందా కట్టించారు. పలకరింపుగా మాత్రం కలుస్తూ ఉండేవాళ్ళం. డాక్టర్ గారు భావ గర్భితంగా చిరునవ్వు నవ్వే మితభాషి అని అనుకున్నాను అప్పుడు. చర్చలేకపోతే ఎప్పుడూ అంతే.

'తిరగబడు' కవితా సంకలనం వెలుబడిన కొద్ది రోజులకు శాస్త్రిగారు రమ్మని చెప్పంపారు. 'పంజా' ఫ్యూడల్ చిహ్నం, 'సింహగర్జన' మన కవులకు అలవాటయిపోయింది గానీ నక్సల్బరీ అయినా మనది ప్రజాగర్జన అనే అవగాహన మనలో నూరిపోయాలి - అని నక్సల్బరీ శ్రీకాకుళం రాజకీయాలు-కవుల

కర్తవ్యాల గురించి నలబైలనాటి తన అనుభవాలతో, గుణపాఠాలతో చెప్పారు శాస్త్రిగారు. ఆ ఆసక్తికరమైన చర్చలో డాక్టర్ గారు సాహిత్యశ్రోత. శాస్త్రి గారు చదవడానికి పుస్తకాలివ్వడం ప్రారంభించారు. ఈ బృందంలో డాక్టర్ గారితో పాటు మరో ఇద్దరు పుస్తకాల పురుగులు అని అర్థమై ఆశ్చర్యపోయాను. పై సాంస్కృతిక విప్లవ కాలంలో వాళ్ళ ఆసక్తి అంతా చైనా. 1970-73 ల మధ్య చైనా మీద వచ్చిన పుస్తకమేదీ డాక్టర్ గారు చదవందిలేదు.

చైనా మీద, వైద్యం మీద తరచు చర్చించడానికే వాళ్ళు అట్లూరి రంగా రావుగారి దగ్గరికి వస్తుండేవాళ్ళు. అట్లూరి రంగారావుగారు హోమియో వైద్యులు. ప్రత్యేక తెలంగాణ మొదలుకొని హోమియో వైద్యం గృహ జీవితం వరకు నా వరంగల్ తొలిరోజులను ప్రభావితం చేసిన విరసం సభ్యుడు. వైద్య రంగంలో మార్క్సిస్టు - లెనినిస్టులు హోమియో వైద్యాన్ని బలపరచాలనే అభి ప్రాయం లీలగా నాలో పొదుకుంటున్న రోజులు. అలోపతి వైద్యంలోని అశాస్త్రీయతను వివరించే కరపత్రం కూడ వేసారు. రంగారావుగారు తాను హోమియో క్లినిక్ ప్రారంభించినపుడు. అలోపతి వైద్యంలోని రోగ నిదానం, విశ్లేషణ, చికిత్సల సంగతి ఎలావున్నా అలోపతి మందులు గుత్త పెట్టుబడి దారుల కంపెనీలవి గనుక అవి తాత్కాలిక ఉపశమనాన్ని ఇచ్చి గుత్త పెట్టు బడుల మధ్యన ఉండే పోటీ స్వభావంవల్ల - ఒక డాక్టర్ రాసిన డోసుకు పోటీగా మరొక డాక్టర్ బలమైన డోసు రాసి - మరొక రోగానికి, ప్రమాదానికి దారి తీస్తాయన్నది నా అభిప్రాయం (ఇప్పటికీ). 1973 చైనా కమ్యూనిస్టు పార్టీ పదవ కాంగ్రెస్‌లో బాగా ప్రచారంలోకి వచ్చిన ఒక పెడధోరణిని సవరించే ప్రయత్నం ఏ మాత్రం బ్యాలెన్స్ తప్పినా మరొక పెడధోరణికి దారితీస్తుంది - అన్న మావో సూక్తిని అన్వయిస్తూ, 'వైరుధ్యాలు' చర్చిస్తూ ఈ చర్చలు చేసే వాళ్ళం. విలియం హింటన్ ఫ్యాన్‌షెన్, హండ్రెడ్‌డేస్ వార్, జోన్ రాబిన్‌సన్ కల్చరల్ రెవల్యూషన్ ఇన్ చైనా, హన్ సుయిన్ చైనా ఇన్ 2001 ఇతర పుస్తకాలు, ఎడ్గార్‌స్నో పుస్తకాలు, జాషువా హార్న్ అవే విత్ ఆల్ పెస్ట్సవంటి పుస్తకాలు మాకప్పుడు కరదీపికలు. డెయిలీ లైఫ్ ఇన్ రెవల్యూషనరీ చైనా కాస్త ఆలస్యంగా మాకు అందుబాటులోకి వచ్చింది. అయితే ఈ పుస్తకాలు, సూత్రాలు ఆధారంగానే డాక్టర్‌గారు అలోపతిని సమర్థించడమే కాదు, హోమియో అశాస్త్రీయ వైద్య మనేవాడు. నేను నా వాదానికి ఇవే ఉపపత్తులు చూపేవాణ్ణి.

చివరకు 'విప్లవ క్యాంపు'లో ఈ చర్చ ఎంత దూరం పోయిందంటే పరీక్షలలో కాపీలు కొట్టడం శిథిలమవుతున్న బూర్జువా వ్యవస్థ నెత్తిమీద మరో

రాయి వేసి చంపడమే - అని చెప్పడానికి, అలోపతిక్ వైద్యం శాస్త్రీయమైందని మాత్రమే కాదు, హోమియో వైద్యం అశాస్త్రీయమైందని చెప్పడానికి కె.ఎం.సి. పోస్టు గ్రాడ్యుయేట్ విప్లవ విద్యార్థి బృందం ఒక రోజు నాకు మూడు గంటలు 'క్లాసు' తీసుకున్నది.

ఏమైతేనేం మందులవల్ల కాక పుస్తకాలవల్ల, ఏకీభావంవల్ల కాక భేదాభిప్రాయంవల్ల డాక్టరుగారితో పరిచయం స్నేహంగా మారింది.

ఎమర్జెన్సీకి ముందు నాకు తెలిసిన డాక్టర్ గారు - క్లినిక్ నుంచి ఇంటికి వస్తే పుస్తకాలు చదవడం - పరిమితంగా ఉన్న మిత్రులతో చర్చించడం. ఆ తృష్ణ ఆయనను సృజనకు, విరసంకు సన్నిహిత మిత్రునిగా మార్చడమే కాదు, పుస్తక ప్రచురణ దాకా తీసుకపోయింది. డాక్టర్‌గారి చేతి చలువ లేకుండా శ్రామికవర్గ ప్రచురణలు లేవు. 1973 విరసం సాహిత్య పాఠశాల సందర్భంగా ఆయన ఆసక్తి అంతా చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం వెలుగులు ప్రసరించే కొత్త పుస్తకాలు తెలుగు పాఠకులకు అందుబాటులోకి రావాలన్నదే. ఈ పని విరసం ఒక్కటే చేస్తున్నది కనుక విరసం సభలు జరగాలి. ఈ సభలు జరగకుండా పోలీసులు చేసే ప్రయత్నాల నెదుర్కొనే రచయితలకు, కార్యకర్తలకు తన మనోవాక్కాయకర్మలా అండ నిలుస్తాడు. పుస్తకాల మీది ఆసక్తి ఆయనను అందులోని విషయాలు ఆచరించే ఆసక్తిలోకి, సాంస్కృతిక విప్లవం, ఉపరితల అంశాల ప్రయోగంలోకి దించింది.

పసిపిల్లలకు తలకు నూనె రాయడం దగ్గర్నుంచి తాయెత్తులు కట్టడం దాకా, జ్వరంవస్తే అన్నం తినొద్దన్న దగ్గరినుంచి వేడి చేసిందనడం దాకా - మూఢ విశ్వాసాలే ఆయన దృష్టిలో. పల్లెటూరి తల్లుల దగ్గర కూడ ఈ విషయాల్లో ఆయన తన అసహనాన్ని దాచుకునేవాడు కాదు. ఇందువల్లా, ఆయన మితభాషిత్వంవల్ల కూడ డాక్టర్ గారు కొందరి దృష్టిలో వివాదాస్పదుడు. జబ్బుతో ఉన్న పిల్లలను తీసుకపోయి ఎంతో ఆందోళనతో తల్లులు వివరిస్తే ఏమీ మాట్లాడకుండా ఒక చిరునవ్వో, పొడిపొడి మాటలతోనో పరీక్ష చేసి మందులు రాస్తాడని వాళ్ళ ఆవేదన. 73 అక్టోబర్‌లో నేను మొదటిసారి మీసా కింద అరెస్టయి వరంగల్ జైల్లో ఉన్నపుడు వరంగల్‌లో ఎరువుల వ్యాపారి ఒకాయన అరెస్టయి జైల్లోకి వచ్చాడు. నా రూంలోనే ఉంచారు. ఆయన ఆ ఒక్క సీజన్‌లోనే వేల రూపాయలు బ్లాక్ మార్కెట్లో సంపాదించాడు. దగ్గరే గుంటూరు పల్లెలో పత్తి, పొగాకు, మిరప కూడ పండిస్తాడు. కమ్యూనిస్టులంటే చాల భయం.

'డాక్టర్ రామనాధం కూడ కమ్యూనిస్టేనట గదా మా ప్రక్కనే క్లినిక్ మరి అంతంత ఫీజు ఎందుకు వసూలు చేస్తాడు, పేదలకు ఉచితంగా వైద్యం చేయొచ్చుగదా' అన్నాడు. 'పిల్లల మెళ్ళో తాయెతులుంటే తెంపేస్తాడు. మొలతాడు తెంపేస్తాడు' అని కూడ అన్నాడు. 'ఫీజు సంగతి ఎరువుల వ్యాపారిని అడిగితే ఎట్లా? మా అడ్డామీదనో, పోచమ్మ మైదాన్ అడ్డామీదనో ఉన్న రిక్షా వాళ్ళను అడగండి. కాశీబుగ్గ నుంచి వచ్చే మిల్ కార్మికులను అడగండి' అన్నాడు ఆ తర్వాత డాక్టర్ గారితో ఈ విషయం నేను ప్రస్తావిస్తే డాక్టర్ గారి హత్య తర్వాత కామ్రేడ్ సుధాకర్ తల్లి దుఃఖాన్ని చూస్తే, ఎంతో మంది రిక్షా కార్మికుల దుఃఖాన్ని చూస్తే ఇది అందరికి అర్ధమవుతుంది. రెండవ ప్రశ్న వేయకుండా పదేళ్ళు పరిశీలించాను. నా దృష్టికి రాలేదు.

పసి పిల్లలు ఆయనకు వృత్తి ఇచ్చిన స్నేహితులైతే నవ యువకులు ఆయనకు స్వభావం ఇచ్చిన స్నేహితులు. ఆయన సమ వయస్కులు ఎవరూ నాకు తెలిసి ఆయనకు స్నేహితులు లేరు. ఆయనతో చనువుగా మాట్లాడే వాళ్ళంతా ముప్పైలలో వాళ్ళే.

భావప్రకటన, సంఘ నిర్మాణ స్వేచ్ఛల గురించి ఆయనకున్న ప్రగాఢ మైన వ్యగ్రతయే ఆయనకు పౌర, ప్రజాతంత్ర హక్కుల ఉద్యమంలోకి తెచ్చింది. విరసం సభగానీ, శ్రామికవర్గ ప్రచురణ గానీ, ఆదర్శ వివాహం గానీ, ఆదర్శ పాఠశాల గానీ, ఆదర్శ వైద్యశాల గానీ - దేని గురించి ఆలో చించినా, పని చేసినా ఆయనను నడిపించిన చైతన్యం అది. అందుకోసం ఆయన ఎంత రిస్క్ అయినా తీసుకున్నాడు.

సేంట్ గాబ్రియెల్ విద్యార్థి గానే 1967-68 లలో నక్సల్బరీ శ్రీకాకుళ రాజకీయాల ప్రభావంలోకి వచ్చిన ఒక విద్యార్థి 74 లో తాను ప్రేమించిన యువతిని వివాహం చేసుకోవాలనుకున్నాడు. రాజకీయాలు, అప్పటికి నిరుద్యోగం తప్ప సాంప్రదాయవాదులైనా అభ్యంతర పెట్టాల్సిన వివాహం కాదది. నిరు ద్యోగం కారణంగా మేం ఇప్పుడు వివాహం వద్దన్నాం. వినలేదు. రాజకీయాలు కారణంగా వద్దన్న వాళ్ళు ఇప్పుడు తెలుగుదేశం ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న ఒకప్పటి రఘునాధరెడ్డి అనుయాయుడైన సోషలిస్టు మొదలు, జిల్లా పరిషత్ చైర్మన్‌ను, ఫారెస్టు, పోలీసు అధికారులను రంగంలోకి దించారు. అమ్మాయి అక్క డాక్టరు. ఆమె సృజనలు కాలబెట్టి చాయ్ చేసి చెల్లెలికి ఆ వెలుగులో తన వ్యతిరేకత రుచి చూపింది. బెదరింపులయ్యాయి. అమ్మాయి మైనర్ అని

పోలీసు వారంటు కూడ తీసుకున్నారు తల్లిదండ్రులు. ప్రకటిత స్థలంలో కాకుండా వివాహం వేరే చేసి ప్రకటిత స్థలంలో వివాహం అయిపోయినట్లు అమ్మాయితో మాట్లాడించాలన్నది నిర్ణయం. ఆ స్థలాన్ని వారంటు తీసుకుని పోలీసులు చుట్టుముట్టారు. అది ఒక స్కూలు ఆవరణ లోపలంతా కిటకిట లాడుతూ జనం జరుగబోయే వివాహం కోసం ఎదురు చూస్తున్నారు. అనుకున్న ప్రకారం వివాహం వేరేచోట చేసి పోలీసు వలయాన్ని ఛేదిస్తూ డాక్టరు గారి కారు స్కూల్లోకి వచ్చింది. మెడలో పూలదండతో అమ్మాయి మైక్ ముందుకు పరుగెత్తి తాను ప్రేమించిన యువకునితో తన వివాహం అయిపోయిందని ప్రకటించి అతన్ని మాట్లాడడానికి పిలిచింది. ఒక వైపు నుంచి తల్లి పరుగెత్తు కొచ్చి ఆ మెడలో పూలదండ తెంపుతూ అమ్మాయిని బరబరా లాగింది. మరో వైపు నుంచి వారంటుతో పోలీసులు. మర్నాడు కోర్టులో గానీ ఆ వివాహం చట్టబద్ధం కాలేదు.

సంప్రదాయం, ఆచారాలు బలంగా పాతుకొని ఉన్న కుటుంబం నుంచి వచ్చిన డాక్టర్ గారు చాల ఓపికగా శాస్త్రీయ భావాలను భార్యకు, కొడుకుకు ఒంటబట్టించడానికి ప్రయత్నించేవారు. ఈ ప్రయత్నంలో భాగంగానే ఇద్దరినీ పరీక్షలకు తయారుచేసే, చదువు చెప్పే పని తన పనుల్లో భాగం చేసుకున్నాడు. ఓపెన్ యూనివర్సిటీ పుస్తకాల్లో పౌర హక్కుల సంఘాల ప్రస్తావనలో ఎ.పి.సి.ఎల్.సి. పేరు లేక పోవడం ఎందువల్ల అని ఆమె అడిగితే డాక్టర్ గారు నన్నడిగారు మీ ఇద్దరినీ ఈ పరీక్షల్లో ఎంగేజ్ చేయడం కోసం' అని చెప్పాను. పాతికేళ్ళదాకా చదువుకొనని యువకులు, గృహిణులు విప్లవం వైపు రాకుండా జాగ్రత్తపడే సేఫ్టీ వాల్వ్ ఓపెన్ యూనివర్సిటీ అని ఆయన అభిప్రాయం కూడ. అయితే ఆ చదువులు ఆయన చెప్పదలచుకున్న విషయాలకు ఇంట్లో ఇంధనమయ్యాయి.

ఎమర్జెన్సీ మొదటి సంవత్సరం గడిచాక తొలికారు, మలికారు అన్నట్లు బయట ఉన్న ప్రజాతంత్రవాదులను మరో పట్టుపట్టింది ప్రభుత్వం. అప్పటికి డాక్టర్ గారు వరంగల్‌లో మొదటి ప్రజా వైద్యశాల ప్రారంభించి నిర్వ హిస్తున్నారు. ఎమర్జెన్సీ నిర్బంధంలో ఆయన ఎంచుకున్న ప్రజాసేవ మార్గం అది. అది కూడ సహించని ప్రభుత్వం ఆయన అజ్ఞాతంలో ఉన్న విప్లవకారులకు ఈ పాలి క్లినిక్‌లో చికిత్స, శస్త్రచికిత్స చేస్తున్నాడనే అనుమానంతో అరెస్టు చేసింది. నిజాం కాలపు 'కాలాపానీ' శిక్ష పాకాల అడవుల్లోనే వేసే వారట. నంజప్ప, పళనియప్పన్‌ల రాక్షస రాజ్యంలో తెలంగాణ రైతాంగ సాయుధ

పోరాట యోధులు, ప్రజలు ఈ పాకాల అడవుల్లోనే ప్రాణాలు పోగొట్టుకున్నారు. చిత్రహింసలు అనుభవించారు. కమ్యూనిస్టు పార్టీ నుంచి కోయలను వేరుచేయ డానికి అశోక్‌నగర్, వల్లభనగర్ వంటి కాలనీలు ఏర్పాటు చేసి వాళ్ళ నందులో ఉండమని బలవంతం చేసింది ఈ పాకాల అడవుల్లోనే. ఇప్పుడా పాకాల అడవిలో చెరువుకు ఇటు అటు రెండు ట్రావెలర్స్ బంగళాలు ఉన్నాయి. ఎమర్జెన్సీలో చెరువుకట్ట చివరన ఉన్న బంగళా కాన్‌సెంట్రేషన్ క్యాంపు అయింది. అందులో మూడు వారాలు పెట్టారు డాక్టర్ గారిని, విరసం సభ్యులను, చాల మంది విద్యార్థి యువజనులను. డాక్టర్ గారిని, విరసం సభ్యులను కొట్టలేదుగానీ వాళ్ళ ముందు విద్యార్థి యువజనులను కొట్టేవారు. వీళ్ళకు కనిపించేలా, వినిపించేలా ప్రశ్నలతో వేధించేవారు. చిత్రహింసలు పెట్టేవాళ్ళు. గిరాయిపల్లి మృతవీరులతో పాటు అరెస్టయి ఆ నలుగురి హత్యకు ప్రత్యక్ష సాక్షిగా మిగిలిన యువకుణ్ణి ఎమర్జెన్సీలో 18 సార్లు అరెస్టు చేసారు. ఈ పాకాల క్యాంపులో ఏనుగంతటి పోలీసు ఆఫీసర్ ఈ యువకుని వీపుపై బూటు కాళ్ళతో నిలబడి తొక్కేవాడు. ఎమర్జెన్సీ ఎత్తివేయగానే, ఈ విషయాల నన్నిటినీ, ఇంకా తన దృష్టికి వచ్చిన వాటినీ జనతా ప్రభుత్వం వేసిన కమిషన్ దృష్టికి వంద అఫిడవిట్ల ద్వారా తీసుకుపోయింది వరంగల్ పౌర హక్కుల సంఘం. స్వయంగా డాక్టర్ గారి కేసు విచారించడానికి కమిషన్ ఎవరో ఆఫీసర్‌ను పంపింది. కాని ఫలితం ఇప్పటికీ నిష్ఫలితమే.

ఎమర్జెన్సీలో జైల్లోనే డాక్టర్ గారికి గుండెపోటు వచ్చింది. డయబెటిస్ వ్యాధి ఉందని కూడ తేలింది. కాని నిజానికి పౌర హక్కుల ఉద్యమంలో ఎమర్జెన్సీ ముందుకన్నా తర్వాతే ఆయన తలమునకలయ్యాడు. ఢిల్లీలో పి.యు.సి.ఎల్.డి.ఆర్. ఏర్పాటు చేసిన జాతీయ సదస్సుకు వెళ్ళి వచ్చాడు. వరంగల్‌లో పౌర హక్కుల రెండవ రాష్ట్ర మహాసభ నిర్వహించి ఉపాధ్యక్ష బాధ్యత స్వీకరించాడు. 79 విరసం సాహిత్య పాఠశాలకు అండగా నిలిచాడు.

డాక్టర్ గారు మానవసేవయే మాధవసేవ అనుకున్నవారు కాదు. వైద్యో నారాయణో అనుకున్నవారూ కాదు. అప్పిచ్చువాడు, వైద్యుడు ప్రతి ఊళ్ళో ఉండాలని అనుకున్నవారూ కాదు. పిల్లలకైనా, పౌరులకైనా ప్రాణం, స్వేచ్ఛ నిలుపుకునే హక్కు ఉందని గుర్తించిన డాక్టర్. స్వేచ్ఛమాత్రమే కాదు, ప్రాణం కూడ తమ స్వాధీనం అనుకున్న పోలీసు వ్యవస్థకుఅందుకే ఆయనశత్రువయ్యాడు.

పీడిత మానవసేవ డాక్టర్ వృత్తి అని మాత్రం ఆయన తప్పకుండా అను కున్నాడు. 1977 నవంబర్‌లో దివిసీమలో ఉప్పెన వచ్చినప్పుడు ఒక డాక్టర్ల

బృందాన్ని, పౌర హక్కుల సహచరుల్ని తీసుకొని అందుకే పరుగెత్తారు. దివిసీమ ప్రజలే స్వయంగా తర్వాత కృతజ్ఞతా పూర్వకంగా ప్రకటించినట్లు ఆ భీభత్స శవసీమలో మొదట అడుగుపెట్టి బతికున్నవారికి ప్రథమ చికిత్స చేసింది ఈ బృందమే. తిరిగి వచ్చి వరంగల్ నగరంలో విస్తారంగా మందులు, నిధులు సేకరించి, ఈ సారి ఒక పశు వైద్యుణ్ణి, ఒక ఫోటోగ్రాఫర్‌ను కూడ తీసుకొనివెళ్ళి నెల రోజులపాటు ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించారు. 1977 డిసెంబర్, 1978 జనవరి సృజన సంచికలు చూస్తే డాక్టర్ గారి కృషి గుర్తుకొస్తుంది. ఈ బృందం తీసిన ఉప్పెన ఫోటోలు 78 ఫిబ్రవరిలో వరంగల్‌లో జరిగిన ఆర్.ఎస్.యు. ద్వితీయ మహాసభలు మొదలు, ఢిల్లీలో జరిగిన పి.యు.సి.ఎల్.డి.ఆర్. జాతీయ సదస్సు దాకా దేశంలో చాలచోట్ల ప్రదర్శించబడ్డాయి.

79 చివర్లో జూనియర్ డాక్టర్లు సమ్మె చేసినపుడు 70 రోజుల పాటు వరంగల్ ఎం.జి.ఎం. ఆసుపత్రి ఎదురుగా ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించింది పౌర హక్కుల సంఘం. ఇది పౌర హక్కుల సంఘం నైతిక బాధ్యత కూడ అయింది. ఒక వైపు జూనియర్ డాక్టర్ల న్యాయమైన హక్కులను, ఆ హక్కులు సాధించుకోవడానికి పోరాటాన్ని తాను బలపరచాలి. మరొక వైపు రంగు నీళ్ళో, ఆస్ప్రిన్ బిళ్ళో పేదలకు దొరికేది సర్కార్ దవాఖానలనే. ఆ మాత్రమైనా పలకరించేది జూనియర్ డాక్టర్లే. మరి వాళ్ళు సమ్మె చేస్తే ఈ రెండు అవకాశాలు పొయ్యేది పేదలైన రోగులకే, రోగులయిన పేదలకే. స్వప్రయోజనాల కోసం సమ్మెను వ్యతిరేకించే వర్గాలు ఇది ప్రచారానికి వాడుకుంటే ఏ ప్రయోజనాలు లేనివాళ్ళు కూడ నమ్మడానికి ఈ వాదంలో చాల బలముంది. స్వయంగా డాక్టర్ అమ్జద్ అలీ గారు ఈ ఆందోళన వ్యక్తం చేసారు. అప్పుడాయన పౌర హక్కుల సంఘం జిల్లా అధ్యక్షుడు. 'అయితే ఎంజిఎం ముందరే పేదల కోసం మనమే దవాఖాన నడుపుదాం. సమ్మె చేస్తున్న జూనియర్ డాక్టర్ల పని ఎగ్గొట్టడానికో, పేదల ప్రాణాలు తీయడానికో కాదు, తమ హక్కుల కోసం పోరాడుతున్నామని నిరూపించుకోవడానికి మన శిబిరంలోనే పని చేస్తారు' అన్నారు డాక్టర్ గారు. 70 రోజులు ఉచిత వైద్య శిబిరం ఎంత ఆదర్శ ప్రాయంగా నడిచిందంటే లాల్ బహదూర్ కాలేజ్‌లో లాఠీఛార్జ్ జరిగితే, ప్రిన్సిపల్, అధ్యాపకులు, విద్యార్థులు ఈ ఆందోళనలో సహకరించవలసిందిగా పౌరహక్కుల సంఘానికి ఆహ్వానం పంపారు. విశ్వహిందూ పరిషత్ ఆర్ఎస్ఎస్, కాంగ్రెస్ పెద్దలు, స్త్రీకి దేవాలయ కర్తృత్వం చెల్లదనే పేరుతో దేవాలయ భూమిని దురాక్రమణ చేయాలని చూస్తే ఆమె పౌరహక్కుల

సంఘాన్నే ఆశ్రయించి ఈ దురాక్రమణను ఆపగలిగింది. ప్రసూతి వైద్యశాలలో పందుల బెడద మొదలు విశ్వవిద్యాలయంలో పోలీసు క్యాంపుల వరకు వరంగల్ పౌరహక్కుల ఉద్యమానికి పట్టని ప్రజా సమస్యలేదు. తరువాత కాలంలో పౌరహక్కుల సంఘంలో డాక్టర్ గారి పాత్ర గురించి చెప్పడానికి నా శక్తి చాలదు. ఎందుకంటే అప్పటినుంచి ఆయన ఆ నిర్మాణంలో ఎంత క్రియాశీలంగా భాగమవుతూ వచ్చాడో నేనంతగా విరసంకు, సృజనకు పరిమితమయ్యాను.

అయితే పోలీసులు ఈ పరిమితులను పాటించకపోవడమే కాదు గుర్తించారు. అందులో వాళ్ళ, వాళ్ళ స్వాముల ప్రయోజనాలున్నాయి. అందు కొన్ని ఉదాహరణ మాత్రం ప్రస్తావిస్తాను.

విరసం సాహిత్య పాఠశాలకు గద్వాలకు వెళ్ళి జనవరి 17 న వరంగల్‌కు తిరిగి వస్తుంటే బస్సులమీద, పట్టణ వీధుల్లో ఎక్కడ చూసినా పోస్టర్లు! కామ్రేడ్ సుదర్శన్‌ను కాజీపేట పోలీసు లాకప్‌లో కొట్టిచంపినందుకు నిరసనగా జనవరి 18 న వరంగల్ జిల్లా 'బంద్'కు రాడికల్స్ పిలుపు ఇచ్చారు.

18 వ తేదీ ఉదయమే మా ఇంట్లో నన్ను అరెస్టు చేశారు. మధ్యాహ్నం 3 గంటల ప్రాంతంలో హనుమకొండ పోలీసు స్టేషన్‌లో నా లాకప్ దగ్గర అలికిడి అయితే తలెత్తి చూసాను. లాకప్ ముందర డాక్టరు గారు, సీతారామరావు నిలబడి చిరునవ్వు, నవ్వడి నవ్వు నవ్వుతున్నారు. వెనుక లాకప్ తీయడానికి సిద్ధంగా ఒక పోలీసు కానిస్టేబుల్. నన్ను చూడడానికి వచ్చారనుకున్నాను. 'మేం కూడా లోపలికి వస్తున్నాం' అంటూ చిరుహాసం చేశారు డాక్టర్‌గారు. లాకప్ లేసాడు ఆ పోలీసు కానిస్టేబుల్. లోపలికి వచ్చారా నన్నెందుకు అరెస్టు చేసారు అని అడుగినందుకు, చేస్తే చేసారు, దురుసుగా ఎందుకు ప్రవర్తించారు అని ప్రశ్నించినందుకు ఎస్పీ స్వయంగా ఈ ఇద్దరునీ అరెస్టు చేయించాడు.

'బంద్'ను విజయవంతం చేయడానికి మా ఇంట్లో రహస్య సమావేశం ఏర్పాటు చేస్తే వాళ్ళిద్దరూ అందులో పాల్గొన్నారని, ఆ సమావేశంలో నేను బాంబులు పంచానన్నది అభియోగం.

లాకప్‌లోకి పంపించిన కానిస్టేబుల్ మళ్ళీవచ్చి లాకప్ దగ్గర నిలబడి దోషిలాగ డాక్టర్ గారిని పిలిచాడు. 'మా పిల్లవానికి ఒంట్లో బాగులేదు.' 'ఏమయింది?' 'జ్వరం' 'చూడడం సంగతి అలా వుంచు. లాకప్‌లో ప్రిస్క్రిప్షన్ కూడ రాసివ్వడానికి వీలులేదు గదా?' డాక్టరు గారు చిరునవ్వుతోనే అంటు

న్నాడు.' ఏం గోలీలు కొనాల్నా చెప్తే మెడికల్ షాప్‌లో కొనుక్కుంటాను సారు! వివరాలు అడిగి డాక్టరు గారు చెప్పారు. ఆ కానిస్టేబుల్ ఎంతో కృతజ్ఞతా భావంతో కదిలాడు. డాక్టరు గారికి ఖాకీ యూనిఫామ్ శత్రువు గానీ అందులో మనిషి శత్రువు అని ఎలా అనగలం.

క్షణికావేశంలో వాళ్ళిద్దరనీ ఎస్పీ అరెస్టు చేయించాడు గానీ ఆ సాయంత్రానికే వదలమంటాడని మేం ముగ్గురమే కాదు స్పెషల్ హౌజ్ ఆఫీసర్ కూడ అనుకున్నాడు. పిలిచి పర్సనల్ బాండుల మీద సంతకం చేయమని అడిగాడు కూడ. కాని ఎస్పీది క్షణికావేశం కాదు. వర్గ ప్రయోజనం.

ఆ సాయంత్రం డాక్టర్ గారికి లాకప్‌లో గుండె నొప్పి వచ్చింది కారణం మరేమీకాదు, రెగ్యులర్‌గా కోర్సుగా వాడాల్సిన మందులు దగ్గర లేవు. ఆయన చెప్పినా, రాసిచ్చినా లాకప్‌లో తెచ్చివ్వరు. రూల్స్‌కు విరుద్ధం. డాక్టరుగారు లాకప్ బయటవున్న పోలీసులకు కూడ డాక్టర్ గానీ లాకప్‌లో జైల్లో వున్నంత వరకు తనకు తాను కూడ డాక్టర్ కావడానికి వీలులేదు. ఈ వ్యవస్థ భాషలో అతడు ఖైదీ. దృష్టిలో అతడు నేరస్థుడు. ఈ ఖైదీ ఆరోగ్యం గురించి మరో డాక్టరు చెప్పాల్సిందే. అందువల్ల ఎంజిఎంకు మార్చారు.

21 వ తేదీన ముగ్గురిని వరంగల్ జెయిల్‌కు పంపారు. 22 న జైల్లో కొడవటి సుదర్శన్ లాకప్ హత్యను ఖండిస్తూ కమ్యూనల్ మీటింగు జరిగింది. 25 దాకా అక్కడ వున్నాం. 25 న నన్ను సికిందరాబాదు జెయిలుకు మార్చారు. 26 న వాళ్ళిద్దరూ బెయిల్ పై విడుదలయ్యారు. డాక్టర్ గారితో నేను జెయిల్లో కలిసివున్నది ఈ అయిదు రోజులే. జైల్లోనూ డాక్టర్ గారు ఎంతో సరదాగా ఎప్పుడూ చిరునవ్వుతో వున్నారు.

పౌర, ప్రజాతంత్ర ఉద్యమం గురించి తన భావాలు స్పష్టమయ్యే కొద్దీ వైద్య వృత్తిలో కూడ ఆయన శాస్త్రీయ దృష్టి నిశితమైంది.

భోపాల్ మారణకాండపై 85 మే సృజన తనకు చేరిన మారునాడే ఆ సంచిక పట్టుకొని మా ఇంటికి వచ్చారు డాక్టరు గారు. క్రిమిసంహారక ఎరువులపై వ్యాసం ఉన్న పేజీల దగ్గర ఆయన వేలు ఉంది. ఈ వ్యాసం రాసింది ఎవరు? నేను మాట్లాడాలి. రసాయనిక ఎరువుల గురించి, మందుల గురించి, మొత్తంగా ఈ రంగంలో గుత్త పెట్టుబడుల గురించి నేను చెప్పాల్సిన విషయాలు ఉన్నాయి, తెలుసుకోవాల్సినవీ ఉన్నాయి అన్నారు. ఈ వ్యాసా

నికి అనుబంధంగా, అన్ని రంగాలను స్పృశిస్తూ తానూ రాస్తానన్నాడు. ఆ వ్యాసకర్త దూరంగా వేరే ఊళ్ళో ఉంటారంటే ఫోన్ చేసి సమయం తీసుకుని వెళ్ళి కలిసి చర్చించి రాస్తానన్నారు. ఆ కోరిక తీరకుండానే పోయారు. డాక్టర్ గారి తీరని మరొక కోరిక - సామ్రాజ్యవాద దేశాల్లో నిషేధింపబడి మూడో ప్రపంచ దేశాల్లో ఇంకా విరివిగా వాడ బడుతున్న అలోపతిక్ మందుల జాబితా ఒకటి కరపత్రంగా వేసి విస్తృతంగా పంచాలని. అది ప్రతి ఆసుపత్రిలోనూ పెద్ద పెద్ద తెలుగు అక్షరాల్లో గోడలకు వేళ్ళాడ దీయాలని. పిల్లల వైద్యుల సమావేశాల్లో గానీ, సంబంధిత కాన్ఫరెన్స్‌లలో గానీ ఆయన ఈ సమస్యను లేవనెత్తుతాననే వాడు. వ్యాపార పోటీగా మారిన వైద్య వృత్తిలో బహుశా ఇది చాదస్తంగా కనిపిస్తుంది.

వైద్యరంగంలో కూడ రెండు అపూర్వమైన విషయాలు ఆయన సాధించాడు. ఒకటి మెడికల్ గైడ్ రచన. ఆయన తెలుగులో రచన చేయడమే ఒక వాక్యమో, వ్యాసమో రాయడమే దీని కోసం! రోజు మధ్యాహ్నం కనీసం మూడు గంటలైనా నిద్రపోయే డాక్టర్ గారు ఈ పుస్తకం రాసినన్ని రోజులు, నెలలు మధ్యాహ్నాలు నిద్రపోలేదు. తెలుగు వాక్యాలు చూడడం నుంచి మొదలు కుంటే ఆయా రంగాల్లో అనుభవం ఉన్న వైద్యులు, ఆయా జబ్బులు తెలిసిన, లేదా ఆయా జబ్బులకు గురైన వ్యక్తులు చదివి ఆమోదించే దాకా చిన్న పిల్ల వాడు ఎక్సర్‌సైజ్ పుస్తకాల్లో సాధన చేసినట్లుగా ఆయన ఆ పుస్తకం రాసాడు. అందుకే ప్రజారంగాల్లో సేవచేస్తున్న కార్యకర్తలకు అది ఒక కరదీపిక అయింది. మళ్ళీ రెండవ ముద్రణలో శస్త్ర చికిత్సకు సంబంధించిన అంశాలు చాల చేర్చి పుస్తకాన్ని విస్తృత పరిచాడు. ఈ పుస్తకంపై నెలలుకాదు, సంవత్సరాలు కృషి చేశాడు. అందుకే 'జననాట్యమండలి పాటలు తర్వాత ఇన్ని కాపీలు అచ్చయి అమ్ముడు పోయిన పుస్తకం ఇటీవలి కాలంలో లేదు.

మెదడు వాపు వ్యాధికి మందు లేదని వైద్యులూ, ప్రభుత్వమూ అంగీకరించి ప్రకటించిన విషయమే. అయినా ఈ వ్యాధి ప్రబలిందన్నప్పుడల్లా హోమియో వైద్య శాలలు రూపాయిన్నరకు ఒక సీసా చొప్పున మందు అమ్ముతూనే ఉంటాయి. జాతరలాగా తెచ్చుకొని పిల్లలకు వేస్తూనే ఉంటారు. నేనూ ఒక సీసా కొనుక్కొచ్చాను. ఒక రోజు విరసం యూనిట్ సమావేశమయ్యాక రంగారావు గారిని అడిగాం నేనూ, ఎన్.కె. 'అది ఏమీ పని చేయదు. ప్రివెన్షన్ కూడ కాదు' అన్నాడు. 'మరి వరంగల్‌లో హోమియో షాపులలో అమ్ముతున్నారు గదా' అంటే 'ఏం చేస్తాం - అదొక వ్యాపారమైంది' అన్నాడు.

'వేస్తే ప్రయోజనం లేకున్నా నష్టం లేదు కదా' అని ఈ చర్చనే డాక్టర్ గారి దగ్గర చేసాం. 'ప్రయోజనం లేకున్నా నష్టం లేదు అనేది ఎట్లా జవాబు అవుతుంది, శాస్త్రీయ దృష్టి ఎట్లా అవుతుంది. దేవునికి దండం పెడితే లాభం లేకున్నా నష్టం లేదు గదా ? అని ఎవరైనా అంటే అది మూఢ విశ్వాసం అని మీ రనరా ?' అని ఎదురు ప్రశ్న వేసాడు. ఆ సీసా పిల్లలకు వాడలేదు.

మెదడు వాపు వ్యాధి - దానికి బూటకపు హోమియో చికిత్స గురించి డాక్టర్ గారు 'ఉదయం'లో రాసారు. ఎందరు చదివారో, ఎందరు అందులోని శాస్త్రీయ దృష్టిని అవగతం చేసుకున్నారో.

డాక్టర్ గారు వైద్య వృత్తినీ, పౌర, ప్రజాతంత్ర ఉద్యమ వ్యావృత్తినీ - పైకి చాల భిన్నమైన రంగాలుగా కనిపించే వాటిని - వాటి మధ్య వైరుధ్యాలు ఉద్యమం సమాజంలో వైరుధ్యాలు పరిష్కరించే క్రమంలో పరిష్కరిస్తూ - మేళవిస్తూ ఆలోచింపజేస్తూ ఆచరిస్తున్నారు గనుకనే పిల్లల డాక్టర్‌ను క్లినిక్‌లోనే పోలీసు అధికారి చంపాడు. ఆ పోలీసు అధికారి తండ్రిగా తన పిల్లలకు జబ్బు చేస్తే డాక్టర్ గారు మందిస్తే అభ్యంతర పెట్టకపోవచ్చు గానీ జబ్బుకు కారణ మేమిటో పిల్లలకో, తల్లికో శాస్త్రీయంగా వివరిస్తే సహించడు. తన పిల్లలకు డిగ్రీలు, ఉద్యోగాలు తెచ్చే చదువు చెప్తే అభ్యంతర పెట్టడు గానీ జిజ్ఞాసను పెంపొందించే చదువు చెప్తే తప్పక అభ్యంతర పెడతాడు. ఆయన దొరగా జీతగాడు ప్రశ్నించడాన్ని సహించలేడు. పోలీసు అధికారిగా పై అధికారిని ప్రశ్నించడు. కిందివాడు తనను ప్రశ్నిస్తే సహించడు. యూనిఫా(ర)మ్ లేనప్పుడు దొరతనమే ప్రభుత్వమనుకుంటాడు. ఉన్నపుడు పోలీసులే ప్రభుత్వ మనుకుంటాడు. ఈ ప్రభుత్వాన్ని ప్రశ్నించడానికి ఎన్ని గుండెలు ? ఆయన వల్ల కాగలిగితే అన్ని గుండెల్లోకి గుండ్లు పేల్చగలడు. అందుకే బూర్జువా యుద్ధాల్లో పాటించే ఆసుపత్రులను మినహాయించే కనీస నీతిని కూడ ఈ వర్గ యుద్ధంలో ఆయన మన్నించలేదు.

డాక్టర్ నార్మన్ బెతూన్ ప్రజా యుద్ధ క్షతగాత్రులకు చికిత్స చేస్తూ అమరుడయ్యాడు. డాక్టర్ చాగంటి భాస్కరరావు, డాక్టర్ దేవినేని మల్లిఖార్జునుడు శ్రీకాకుళ రైతాంగ పోరాటంలో బూటకపు ఎన్‌కౌంటర్లలో అమరులయ్యారు. సారాంశంలో డాక్టర్ రామనాథం గారు అటు నార్మన్ బెతూన్, ఇటు భాస్కర రావు, మల్లిఖార్జునుడుల అమరత్వంలోని ఒకే అంశానికి సంబంధించిన రెండు పార్శ్వాలూ ఇముడ్చుకున్న వారసుడుగా చిరస్మరణీయుడు.

నేను రాజాకార్లను చూసాను. వాళ్ళు పోలీసులతో పాటు వచ్చి, పోలీసు పటేలు అయిన మా చిన్నాయన ఇంట్లో తిని, మా ఇంటి ముందరే కచేరీలో చాల సేపు గూడుపుఠానీ చేసి మూడో జాము వరకు మా చిన్నాయన ఇంట్లోనూ, మా ఇంట్లోనూ పడి బెగ్గం పాడు చేసారు. నిద్రిస్తున్న పసి పాపను రక్షించు కోవాలనే ధ్యాస కూడ లేకుండా తల్లితో సహా అందరం ఊరు బయట కంది చేనులోకి పరుగెత్తి, రజా కార్లు వెళ్ళిపోయారని తెలిసేదాకా తలదాచుకున్నాం. చేనులోకి పోయాక ఆ తల్లి తన బిడ్డ ప్రాణాలకు ఏమవుతుందోనని కడుపు తరుక్కుపోయేలా రోదించింది. మా అమ్మ సాహసించి తాను తెస్తానని పోయింది. రజాకార్ల విచ్చుకత్తుల విన్యాసాలకు, దోపిడీ దాహంలో రాసుకున్న గిట్టల చప్పుళ్ళకు, అరుపులకు మెలకువ వచ్చిన పాప ఏడవబోయి, ఎత్తుకునే వాళ్ళు, ఓదార్చేవాళ్ళు కనిపించక నిర్విణ్ణమై బిగబట్టుకున్నది. దోపిడీ కోసం వేయి కళ్ళయిన రాజా కార్లకు కాళ్ళ కింది పాప కనిపించలేదు. వెళ్ళిపోయారు. ఆ పాప నెత్తుకొని మా అమ్మ చేన్లోకి తిరిగొచ్చింది.

పసి పిల్లలకూ, ప్రజలకూ బతకాలనీ, స్వేచ్ఛగా బతకాలనీ ఆకాంక్షను రగిలించి అమరులైన డాక్టర్ గారి వంటి వాళ్ళ పిల్లల ఆసుపత్రి, క్షతగాత్ర పీడితుల శిబిరం తెరిచే ఉంటాయి.

రాజాకార్లు, పోలీసులు, హిందూ రజాకార్లు, పోలీసులు, పోలీసు రజాకార్లు, ఇట్లా వేషాలు, దృశ్యాలు మారుతూ, తారుమారవుతూ వారు వీరై, వీరు వారై, వారే వీరయి వస్తూ పోతూనే ఉంటారు. డాక్టర్ నారాయణరెడ్డి, డాక్టర్ రామ నాథంలను చంపుతారు. పిల్లలు, తల్లులు, ప్రజలు చూస్తూనే ఉంటారు. ఎవరూ ప్రేక్షకులు కారు. అయినా మనం చూస్తున్న చరిత్ర మనం పాల్గొంటున్న చరిత్ర. మనం నిర్మించుకుంటున్న చరిత్ర. మన కన్నీళ్ళతో, నెత్తురులో, మన విషాదాలతో, విజయాలలో.

—వి. వి.

30-9-1985

# వెలుగు నీడలు

1930 లలో ముష్టికుంట్ల చాల చిన్న గ్రామం. జనాభా రెండు మూడు వందలకంటె ఎక్కువుండేది కాదు. ఇది మధిర తాలూకాలో సరిహద్దు గ్రామం. మధిర హైదరాబాద్ రాష్ట్రాన్ని బ్రిటిష్ ఇండియా (ఆంధ్ర)తో వేరు చేసే సరిహద్దు తాలూకా. సరిహద్దు అవతల కృష్ణా జిల్లా జగ్గయ్యపేట నలభై మైళ్ళ లోపే. సరిహద్దు కిటు ప్రస్తుత జిల్లా కేంద్రం ఖమ్మం ఇరవై ఐదు మైళ్ళ లోపే. కాని అప్పుడది వరంగల్ జిల్లాలో భాగం. 30 ల లోనే మధిర ఆంధ్ర మహాసభ ప్రభావంలో కొచ్చింది. ఆ దశాబ్దంలో రైతాంగ పోరాటంతో ముందుకు నడిచింది. సరిహద్దు కావడంతో సాయుధ పోరాట దశలో కీలకమైన పాత్ర నిర్వహించింది. కమ్యూనిస్టు పార్టీకి మధిర తాలూకా పెట్టని కోట అయింది. తెలంగాణ పోరాట అమర వీరులలో అత్యధిక భాగం మధిర తాలూకా వాళ్ళే. ఉద్యమ ప్రభావానికి లోనుకాని గ్రామమంటూ లేదు. ముష్టికుంట్ల కూడ అలాంటిదే ఒక గ్రామం. అప్పట్లో గ్రామం ఇప్పటిలా కళకళ లాడుతుండేది కాదు. ఎక్కువ భాగం మెట్ట ప్రాంతం. జొన్నలే ప్రధాన పంట. ముప్పై ఎకరాల భూమి ఉన్న కుటుంబానికి కూడ బతుకు కష్టంగానే గడిచేది. తర్వాత కాలంలో గ్రామానికి కెనాల్ నీళ్ళొచ్చాయి. ఎక్కువ భాగం ఇరిగేషన్ వచ్చింది. గ్రామంలో కొంతమందయినా బాగుపడ్డారు. కరెంటొచ్చింది. 30 ల నాటి ఏకైక ప్రైమరీ స్కూలు ఇప్పుడు హైస్కూలయింది. కాని అప్పుడూ ఇప్పుడూ కూడ ఊళ్ళో డాక్టర్ లేడు.

ఇక్కడే, ఈ గ్రామంలో 16 అక్టోబర్ 1933 న రామనాథంగారు పుట్టారు. ఏడునూతుల అనంతరామరావు రాజ్యలక్ష్మి గార్లకి మూడో కొడుకు. కుటుంబానికి మొత్తం ముప్పై ఎకరాల మెట్ట భూమి ఉండేది. చాలీ చాలని ఆదాయం. బహుశా అందుకే పిల్లల్ని పై ఊరు పంపించి చదివించడం అనంత రామారావుకు ఇష్టం ఉండేది కాదు. పెద్ద కొడుకు వెంకట్రామయ్య కొద్దిపాటి చదువుతో రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగానికి కుదురుకున్నాడు. రెండో కొడుకు పొలం పనులు చూసుకునేవాడు. రామనాథం పై చదువులకి బైటికి వచ్చారు. ఆయనే తమ్ముడు అచ్యుతరామరావు పెద్ద చదువులకి కారణ మయ్యారు.

ఊళ్ళో ప్రైమరీ స్కూలు, ఖమ్మంలో ఎచ్.ఎస్.సి. పూర్తి చేసుకున్నారు. ఆ తర్వాతే సమస్య వచ్చింది. పట్నం వెళ్ళి చదువుకోవాలంటే ఆర్థిక ఇబ్బంది.

పైగా తండ్రికి అస్సలు ఇష్టం లేదు. దానికి తోడు నిజాం కాలేజిలో సైన్సు గ్రూప్‌లో సీటు రాలేదు. చివరికి ఏలూరు వెళ్ళి కట్టమంచి రామలింగారెడ్డి కళా శాలలో ఇంటర్‌మీడియట్ చదువుకున్నారు. చదువు మీద పట్టుదల నిజానికి ఆయనకున్న జ్ఞాన దాహంలో ఒక భాగం మాత్రమే. తన చదువు మాత్రమే కాదు, ఊళ్ళో అందరూ కూడ పుస్తకాల ద్వారా విశాల ప్రపంచాన్ని తెలుసు కోవాలని ఆయన కోరుకుంటుండేవారు. ఇంటర్‌మీడియట్ చదువుకునే రోజుల్లోనే ఒక వేసవి కాలం తిరిగి తిరిగి చందాలు, పుస్తకాలు సంపాదించి లైబ్రరీ ఒకటి ఊళ్ళో రామనాథంగారే ఆరంభించారు.

ఇంటర్మీడియట్ పూర్తి చేసుకుని నగరంలో నిజాం కాలేజిలో బి.ఎస్‌సి. లో చేరారు. మొదట్లో హాస్టల్ సీటు రాలేదు. అప్పుడు రామానుజాచారి గారింట్లో ఉండేవారు. చారిగారు వెంకట్రామయ్య గారికి సన్నిహితుడు. కమర్షియల్ టాక్స్ ఆఫీసర్. ఏడునూతుల కుటుంబంలో ఎవరెప్పుడు నగరానికి వచ్చినా సుల్తాన్ బజార్‌లో వాళ్ళింట్లోనే దిగేవాళ్ళు, నగరంలో తన విద్యార్థి జీవిత కాలమంతా రామనాథంగారు తరచు వాళ్ళింట్లోనే గడిపేవారు.

బి.ఎస్‌సి. చదువుకునే రోజుల్లోనే ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ యూనియన్ కార్యకర్తలతో స్నేహం ఏర్పడింది. అప్పట్లో అదే హైదరాబాద్ రాష్ట్రానికి విద్యార్థి ఫెడరేషన్. ఈ సాంగత్యానికి కారకుడు పురుషోత్తమరావు. ఫెడరేషన్‌లో క్రియాశీల కార్యకర్త. సన్నిహిత బంధువు. ప్రస్తుతం ఖమ్మంలో న్యాయవాది. పురుషోత్తమరావు ద్వారానే ఆయనకి డాక్టర్ పరంజపేతో పరి చయం ఏర్పడింది.

డాక్టర్ బాలచంద్ర పరంజపే నగర కమ్యూనిస్టు పార్టీ నాయకుల్లో ప్రముఖుడు. 1948 లో మెడిసిన్ డిగ్రీ పుచ్చుకుని కమ్యూనిస్టు పార్టీ సభ్యు డయ్యాడు. సాయుధ పోరాట అజ్ఞాతవాసంలో గెరిల్లా దళాలకి డాక్టర్. పోరాట విరమణానంతరం హైదరాబాద్ తిరిగి వచ్చి ట్రూప్ బజార్‌లో ప్రాక్టీస్ పెట్టాడు. యువకులందరికీ పెద్ద దిక్కు. నగరంలో ఏ ఆవాసం లేనివాళ్ళకి ఆయన ఇళ్ళే ఆశ్రయం. రామనాథంగారు కొద్ది రోజుల్లోనే ఆ ట్రూప్ బజార్ మిత్ర బృందంలో చేరారు. అవి ఆయనకి సమాజం గురించి తొలి చైతన్యపు రోజులు. బి.ఎస్‌సి. పూర్తయింతర్వాత హాస్టల్ నుంచి బైటికొచ్చి ఆయనక్కడే కొన్నాళ్ళున్నారు. మొదట్లో మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పని చేశారు. తర్వాత నలగొండ జిల్లా దేవరకొండలో టీచర్‌గా పని చేశారు. అయితే ఏడాది తిర

క్కుండానే ఆయన మళ్ళీ నగరం వచ్చేశారు. కొత్తగా పెట్టిన గాంధీ మెడికల్ కాలేజిలో సీటొచ్చింది. ఇన్నేళ్ళ తర్వాత తన కల నిజమైంది.

అప్పుడే పెళ్ళి కూడ అయింది. భార్య లక్ష్మి పెద్ద వదినకి దగ్గరి బంధువు. వాళ్ళది వరంగల్ దగ్గరి ప్రాంతం. మెడిసిన్‌లో చేరడానికి అవసర మయిన ఆర్థిక సహాయం ఆవిడే చేసింది. అయితే మెడిసిన్ చదువుకునే రోజుల్లో ఆయనకు ఆర్థికంగా గడ్డు రోజులు. ఇంటి దగ్గరి నుండి మహా అయితే నెలకు యాభై రూపాయలు వచ్చేవి. చిక్కడపల్లిలో గది తీసుకుని భార్యాభర్తలిద్దరూ దాంతోనే వెళ్ళదీసేవారు. ఒకే ఒక జత బట్టలతో రోజులు గడిచేవి. అనాటమీ పరీక్ష ఒక్కసారి పోవడం మినహాయిస్తే ఆయన చదువు మాత్రం సాఫీగా గడి చింది. ఆ పరీక్ష పాసయింతర్వాతే విద్యార్థి సంఘ కార్యదర్శిగా పోటీ చేసి గెలిచారు కూడ. హౌస్ సర్జన్సీ చేసుకునే సరికి ఆ రూంకి తమ్ముడు కూడ వచ్చి చేరాడు. అడపా తడపా రెండో అన్నయ్య డబ్బులు పంపుతుండేవాడు గాని అవి సరిపోయేవి కావు. ఎలాగైతే ఏం మెడిసిన్ గడిచింది.

డిగ్రీ పుచ్చుకొని ఉస్మానియా మెడికల్ కాలేజిలో డిప్లొమా ఇన్ చైల్డ్ హెల్త్ (డి.సి.ఎచ్.) లో చేరారు. కోర్సు నీలోఫర్ హాస్పిటల్‌లో నడిచేది అప్పుడే ఆయనకి డాక్టర్ రాజగోపాలన్ అధ్యాపకుడు. రాజగోపాలన్ అప్పటికి ప్రముఖ కమ్యూనిస్టు. విద్యార్థుల మీద ఆయన ప్రభావం ఉండేది. అయితే రామనాథంగారికి ఏ దశలోనూ కమ్యూనిస్టులతో నిర్మాణ పరమయిన సంబంధం ఉండేది కాదు. చదువులో ప్రతిభావంతుడుగాను అధ్యాపకు లందరికీ జ్ఞాపకం. చాలా ఏళ్ళు పోయింతరువాత ఈ ఇద్దరు డాక్టర్లు తిరిగి ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘంలో కలిసారు.

బి.ఎస్.సి చదువుకునే రోజులనుండి సెలవులకి ముష్టికుంట్ల వచ్చినప్పు డల్లా ఊళ్ళో సమస్యల మీద ఏదో ఒక అందోళన చేస్తుండేవారు. ఒకసారి కంట్రోల్ క్లాత్ దుకాణాదారు అవకతవకలు చేస్తున్నాడని చాలా పెద్ద గొడవ చేసి ఊళ్ళో పంచాయితీ పెట్టించారు. ఆ దుకాణ్‌దార్ ఆయనకు స్వయనా పెద్దనాన్న! అలాగే మెడిసన్ చివరి సంవత్సరాల నుండి మరణించే దాకా ఊరొచ్చినప్పుడల్లా అందరి ఆరోగ్య పరామర్శ చేస్తుండేవారు. అందరి ఇళ్ళల్లోను కలగొలుపుగా తిరిగేవారు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి మాలమాదిగల ఇళ్ళల్లో అంత స్వేచ్ఛగా తిరగడం అందరికి ఇష్టం ఉండేదికాదు. కాని ఊరి తోనూ, ఊరి ప్రజలలోనూ ఆయన అనుబంధం అమలులో ఉన్న సాంఘిక

సంబంధాల కంటె బలమయినది. అందుకే ఆ విషయంలో తన మీద విమర్శలు, ఇంట్లో తగువులు పట్టించుకునేవారుకాదు. ఒకసారి, 1975 లో గ్రామ తగాదాల్లో ఊళ్ళో ఒక హత్య జరిగింది. హతుడు డాక్టర్ గార్కి సన్నిహిత బంధువు. ఆ కేసు గురించి పోలీసులు ఊరొచ్చి నానా భీభత్సవం సృష్టించారు. ఆ విషయం తెలిసి డాక్టర్ గారు వరంగల్ నుండి వచ్చి ఊరి ప్రజల తరపున ఖమ్మం ఎస్. పి. ని కలిసారు. ఆయన ప్రయత్న ఫలితంగానే అమాయకులు అక్రమ నిర్బంధం నుండి బయటపడ్డారు. ఊరు పోలీసు దాడుల నుండి విశ్రాంతి పొందింది.

ఏమయితేనేం, డిసిహెచ్ కూడా పూర్తిచేసుకొని ప్రభుత్వ ఉద్యోగంలో చేరారు ముందుగా వరంగల్ మహాత్మాగాంధీ మెమోరియల్ హస్పటల్ లో డాక్టర్ గిరి. (చివరికి ఆయన అక్కడే మరణించారు). అప్పుడే కాకతీయ మెడికల్ కాలేజిలో ట్యూటర్ గా పనిచేశారు. ఆయనకు కూడా అక్కడొక విద్యార్థి తర్వాత కాలంలో పౌరహక్కుల సంఘంలో సహచరుడు అయ్యాడు. (డాక్టర్ కాటా నారాయణరావు, రాజమండ్రి) ఆ రకంగా పౌరహక్కుల సంఘంలో మూడు తరాల అధ్యాపకులు, విద్యార్థులు తిరిగి కలిసారు.

రెండేళ్ళ వరంగల్ సర్వీస్ తర్వాత గ్రామాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో సర్వీసు. ముందు చిట్యాల,తర్వాత వంగర, చివరగా హుస్నాబాద్. ప్రభుత్వ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు అప్పుడు ఇప్పుడు కూడా గ్రామాంలో సాంఘికాధికారం తమ గుప్పిట్లో ఉంచుకున్న వాళ్ళ ప్రైవేట్ దవాఖానాలేగాని ప్రభుత్వ కేంద్రాలు కావు. ఆ రకం చట్రంలో అనివార్యంగానే డాక్టర్ గార్కి అడుగడుగునా ఇబ్బందులు కలిగాయి. హుస్నాబాద్ ఆయన ఆఖరి ఉద్యోగం అయింది.

హుస్నాబాద్ పెద్ద ఊరు. పదివేల జనాభా ఉండేది. పొద్దున సాయంత్రం దవాఖానాకు పేషెంట్లు బాగా వస్తుండేవారు. ముందున్న డాక్టర్ క్లినిక్ లో కూర్చోకుండా ప్రైవేట్ ప్రాక్టిస్ నడుపుతు డబ్బులు గడించేవాడు. ఆయన వెళ్ళిపోయింతర్వాత ఆ సాంప్రదాయాన్ని కాంపౌండర్ కొనసాగించాడు కాని రామనాథంగారు మాత్రం కొనసాగించలేదు. పొద్దున సాయంత్రం టంచనుగా రోజూ ప్రభుత్వ కేంద్రంలోనే కూచునేవాడు. ప్రభుత్వ మందులన్ని కాంపౌండర్ తన ప్రైవేట్ వ్యాపారానికి వాడుకోవటం ఆయన కిష్టం ఉండేది కాదు. కాని అతనికి బి.డి.వొ. సపోర్టుండేది. బిడివోని సమితి ప్రెసిడెంటు

సమర్థించేవాడు. రామనాథం కూడా ప్రైవేట్ ప్రాక్టీసు పెడితే తమ సమస్యలు తీరుతాయని వాళ్ళు ఆయనను ఒత్తిడి చేసారు. కాని డాక్టరు గారు ఒప్పుకోలేదు. హుస్నాబాద్‌లో పనిచేసిన రెండేళ్ళ కాలంలో చాలాసార్లు ఆయన రాజీనామా చేసి వెళ్ళిపోదామనే అనుకున్నారు. కాని ప్రతిసారి స్థానిక శాసన సభ్యుడు లక్ష్మీకాంతరావు బ్రతిమాలి ఆ పని చేయనివ్వలేదు. హుస్నాబాద్ కొన్నాళ్ళ తర్వాత మంచి డాక్టరొచ్చాడు. జనం సుఖపడ్తున్నారు. వెళ్ళడానికి వీల్లేదనేదే ఆయన పట్టు. చివరికి ఒక రోజు అర్థరాత్రి సమితి ప్రెసిడెంట్ డాక్టర్ గార్కి కబురు పెట్టాడు. అక్కడికెళ్తే వాకిట్లో ఒక స్త్రీ శవం ఉంది. అవిడెవరో తెలియదు. 'ఎండ్రిన్ తాగి చచ్చిపోయిందని సర్టిఫికెట్ ఇవ్వండి.రాత్రికి దహనం కావాల' నడి గాడా పెద్దమనిషి. డాక్టర్ గారు ఒప్పుకోలేదు. పోలీసుల్ని పిలిపిస్తే గాని ఏమి చెయ్యనని చెప్పి తిరిగి వచ్చేసారు.ఇది జరిగిన కొద్ది రోజులకేరాజీనామా చెయ్య లనిఆయన నిర్ణయించుకున్నాడు.

అలా 1968 లో వరంగల్‌లో ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టారు. అప్పుడా బజారు ముకరంజాహి రోడ్డు, ఇప్పుడది జయప్రకాశ్ నారాయణ రోడ్డు, వరంగల్‌లో మొట్టమొదటి పిల్లల డాక్టర్ ఆయనే. త్వరలోనే పాపులర్ డాక్టర్ కూడ అయ్యారు.

వరంగల్‌లో ప్రాక్టీస్ పెట్టిననాటి నుండి వృత్తి ధర్మానికి తన సామాజిక విశ్వాసాలకి మధ్య ఉన్న అంతరాన్ని ఆయన పూడ్చుకుంటూ పోయాడు. రాష్ట్రంలో పౌరహక్కుల ఉద్యమం నిర్మాణరూపం తీసుకోక పూర్వమే ఆయన ప్రజాస్వామిక హక్కుల మీద చైతన్యాన్ని అలవర్చుకున్నాడు. మరో డాక్టర్ అజ్మద్ అలీతో కలిసి వరంగల్‌లో పౌరహక్కుల సంఘానికి ఆద్యుడయ్యాడు. ఆ క్రమంలోనే ఎమర్జెన్సీ కాలంలో ఏడాదికి పైగా నిర్బంధంలో గడిపాడు.

ఎమర్జెన్సీ ఎత్తివేసిన నాటినుండి రాష్ట్రంలోనూ, దేశంలోనూ పౌర హక్కుల ఉద్యమం తన విస్తృతిని పెంచుకుంది, వైవిధ్యాన్ని సంతరించుకుంది. విశాలమైన దృక్పథంతో విస్తృత ప్రజా సమస్యలని చేపట్టింది. డాక్టర్‌గారు ఈ ఎదుగుదలతో ప్రభావం చెందిన వాడు. తిరిగి దాన్ని ప్రభావితం చేసిన వాడు. ఢిల్లీ బొంబాయిలలో పౌరహక్కుల సంఘ సమావేశాలలో చురుకుగా పాల్గొన్నారు. వరంగల్‌లో డాక్టర్ల సమ్మెలో, దివిసీమ ఉప్పెనలో క్రియా శీలకమైన పాత్ర నిర్వహించాడు. రిజర్వ్ కానిస్టేబుల్ మోసం చేసిన స్త్రీ సమస్య నుండి దేవాలయ అధికారులు వెళ్ళగొట్టిన వితంతు పూజారిణి సమస్య

దాకా, ఎల్ బి కాలేజి లెక్చరర్ల నుండి ప్రసూతి ఆసుపత్రి రోగుల దాకా వైవిధ్యం ఉన్న సమస్యలని తీసుకుని ముందుకు సాగిన పౌరహక్కుల సంఘం వరంగల్ శాఖకి ఆయన ఊపిరి. రాష్ట్ర ఉపాధ్యక్షుడు అయిన తర్వాత రాష్ట్ర స్థాయిలో కూడ ఆయన సంస్థ ఎదుగుదలకి తోడ్పడ్డాడు. వరంగల్ లో గత కొద్ది సంవత్సరాలుగా పెరుగుతూ వస్తున్న నిర్బంధం చివరికి పౌరహక్కుల ఉద్యమాన్ని కూడ తాకింది. గత రెండేళ్ళ కాలంలో నాలుగు సమావేశాలు మినహాయించి సభ పెట్టుకునే స్వాతంత్ర్యం కూడా పోయింది. ఈ జనవరిలో డాక్టరు గారు వారం రోజులు జైల్లో గడిపారు. హక్కుల కోసం పోరాడే వాళ్ళ హక్కులని అణచితే తప్ప నడవలేని దశకి ప్రజాస్వామ్యం చేరుకుంది. అందుకే వరంగల్ పోలీసులు ఈ హత్యకు పూనుకున్నారు.

అయితే ప్రజాస్వామిక హక్కుల మీద ఆయన దృక్పథం డాక్టర్ గా ఆయన వృత్తినుండి వేరుచేసి ఆయన చూడలేదు. మనం చూడలేం. స్వేచ్ఛగా జీవించే హక్కు లేనంత కాలం ట్రీట్ మెంట్ ఇచ్చి ప్రజలకు జీవితాన్ని, ఆరోగ్యాన్ని ఇవ్వడంలో అర్థమూ లేదు, ప్రయోజనమూ లేదు. తనను అభిమానించిన ప్రజల దృష్టిలో ఆయన పేదల డాక్టర్. కాని తన దృష్టిలో ఆయన పీడితుల డాక్టర్.

ముఖం మీద ఎప్పుడూ మెదిలే చిరునవ్వు, మామూలుగా మాట్లాడుతూనే ధైర్యాన్నిచ్చే ఆయన సంభాషణ ఆయన్ని ప్రజల దృష్టిలో "మంచి డాక్టర్" ని చేశాయి. వృత్తిరీత్యా కూడ ఆయన సమర్థుడు. కేవలం ట్రీట్ మెంట్ మాత్రమే కాదు. ఆరోగ్యంమీద ఆయనకున్న శాస్త్రీయ దృక్పథాన్ని కూడ పేషెంట్ల కివ్వడానికి ఆయన ప్రయత్నించాడు. మెడికల్ గైడ్ పుస్తకము అలా వచ్చిందే. తోటి డాక్టర్లలోను, ఫార్మసిస్టులలోను ఆయన "గుడ్ ప్రొఫెషనల్" అని పేరు తెచ్చుకున్నాడు. వయసు మీరినా చదువుకోవాలని, నేర్చుకోవాలని కోరికను మాత్రం పోగొట్టుకోలేదు. మరణానికి మూడు వారాల ముందే హైదరాబాద్ లో నిజాం ఆర్థోపెడిక్ ఆస్పత్రిలో జరిగిన కాన్ఫరెన్స్ లో రెండు రోజుల పాటు ఆసక్తితో పాల్గొన్నాడు. చివరికి బులెట్ దెబ్బతిని హాస్పటల్ కి వెళ్తున్న ఆఖరి ఇరవై నిమిషాలలో కూడ తోటి యువ డాక్టర్ కి తనని ఎలా ట్రీట్ చేయాలో సూచనలిస్తూనే పోయాడు.

జబ్బులో ఎవరైనా ఏ డాక్టర్ దగ్గరకైనా వెళ్తే మందులే కాదు, మంచి మాటని ధైర్యాన్ని కూడ ఆశిస్తారు. పేషెంట్ల మీద శ్రద్ధాసక్తులు ఆయనని అందరికీ ఆత్మీయుణ్ణి చేశాయి. మామునూర్ పోలీసు లైన్స్‌లో ఉన్న పోలీసుల పిల్లల నుండి రిక్షావాళ్ళ పిల్లల వరకు అందరూ ఆయన పేషెంట్లే అయ్యారు. పౌర హక్కుల సంఘంలో చురుకుగా పనిచేయడం ఆరంభించిన తర్వాత కూడా ఆయన పోలీసులకి డాక్టర్‌గానే కొనసాగాడు. లాకప్‌లో ఉన్నప్పుడు కూడ వాళ్ళకు మందులిచ్చారు. హత్యకు కొద్ది వారాల ముందే ప్రమోషన్ మీద ట్రాన్స్ఫరయి వెళ్ళిపోతున్న ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టర్. "పోలీస్ ఆఫీసర్‌గా కాదు సార్, మీ పేషెంట్ల తండ్రిగా స్వీట్లిస్తున్నాను తీసుకోండ"ని బలవంత పెట్టాడు. ఆ కోరికను నిరాకరించని డాక్టర్‌గారి హృదయంలో తనకీ తన పేషెంట్లకీ మధ్య ఈ పదిహేడు సంవత్సరాల కాలంలో ఆయన పెంచుకున్న బాంధవ్యం మీద విశ్వాసమే ఉంది. ఆ విలువలు హత్యచేసిన పోలీస్ ఆఫీసర్లకే లేవు. కాని ప్రజలకు మాత్రం ఉన్నాయి. అందుకే సెక్షన్ 144 ని, సాయుధ పోలీసుల పిచ్చుకత్తుల పహారాని లక్ష్య పెట్టకుండా సెప్టెంబర్ 4 న వందల వేలుగా జనప్రవాహం ఆయన ఆఖరి దర్శనం కోసం వచ్చారు. తనను కాల్చింది. తానెరిగిన, తన పేషెంట్ల తండ్రులే అని గుర్తించిన డాక్టర్ గారు తాను విశ్వసించి, ఆచరించిన విలువల గురించి ఆఖరి క్షణాల్లో ఏమనుకున్నారో మనకు తెలియదు. కాని భయంకర నిర్బంధంలో కూడ వరంగల్ పీడిత ప్రజానీకం ఆ విలువలతో నిలబడి తమ డాక్టర్‌కి జోహార్లర్పించారు. అందుకే ఆయన జీవితమూ, మరణమూ కూడ మానవతా విలువలకి, ప్రజాస్వామిక సాంప్రదాయాలకి ఒక అద్భుతమైన ఆవిష్కరణ, ఒక నిరంతర ప్రేరణ.

—సురా

[ఈ రచనకి డాక్టర్‌గారి సన్నిహితులు అనేక మందితో జరిపిన సంభాషణలు ఆధారం. వాళ్ళందరూ అజ్ఞాతంగానే మిగిలిపోక తప్పని స్థితి. ప్రస్తుతం రాష్ట్రంలో పౌరహక్కుల పరిస్థితిపై ఒక తీర్పు.]

# ప్రజల డాక్టరమ్మో

మా ప్రజల డాక్టరమ్మో
నాయన్నా రామనాథం
పేదోల్ల డాక్టరమ్మో
నాయన్న రామనాథం
పౌర హక్కుల కోసం
ప్రాణాలను బలియిచ్చిన ॥మా ప్రజల

ముసి ముసి నవ్వులోడు, పసిపిల్ల మనుసోడు
పోరాడె తమ్ములాను, ప్రాణంగ చూసెటోడు
మెత్తాని మనసులోడు, నెత్తురు జెండలోడు ॥మా ప్రజల

పసిపిల్ల లెత్తుకోని, అరె కన్నతల్లులొస్తె
ఆరెచావుబతుకులల్లో, సంటిపిల్లలొస్తె
ఒడిలోకి తీసుకోని, ఓర్పుతొ చూసెటోడు ॥మా ప్రజల

పంటలను చెరిచె హక్కు, ఏ పార్టి యిచ్చెనండు
గుడిసెలను కూల్చె హక్కు, ఏ గురుడుయిచ్చెనండు
కట్టేసి కాల్చె హక్కు, ఏ చట్టమిచ్చెనండు ॥మా ప్రజల

పేదోల్ల గుడిసెమీద, అరె గుండ్లు పేల్చెటోని
పోలీసు స్టేషనుల్లో, చెల్లెండ్ల చెరిచెటోని
నిజ నిజాల కమిటేసి, అరె నిజం లాగెటోడు
అదురు బెదురు లేక, నిలదీసి అడిగెటోడు ॥మా ప్రజల

అన్న గుండె మీద, గన్నులు పేలగానె
ఓరుగల్లు పల్లెలన్ని, అరె సిన్నబోయినాయి
పసిపిల్లలున్న తల్లి, గొల్లున ఏడ్చినాది
కనుకున్న కన్నతల్లి, కన్నీరు బెట్టినాది ॥మా ప్రజల

మా గోపిరాజంను, గుండాలు కాల్చివేస్తె
గొంతెత్తి దేశమంత, ఈ వింత చెప్పినాడు
రాజన్న బాటలోన, తన రుణం తీర్చుకుండు ॥మా ప్రజల

ఇది నల్లడబ్బు చట్టం, ఇది బలసినోని చట్టం
ఇది రామారావు చట్టం, ఇది రాజీవుల చట్టం
ఈ దొంగ చట్టాల్లోని, జరుగాదు న్యాయమండు ॥మా ప్రజల

పోలీసు గుండగాల్లు, అన్నను గుంజుకొచ్చి
బజార్లో కిసిరివేసి, బంతులూ ఆడినారు
పక్కల్లో గుద్దినారు, డొక్కల్లో తన్నినారు
ఐజిపి ఎస్పీ సిఐ, ఎర్రిగా నవ్వినారు
నాయన్న కూతమీద, కసితోని కాల్చినారు
గుండెల్లో గుండ్లు పేల్చి, వాల్ల గోరి తవ్వుకుండు ॥మా ప్రజల

బొద్దున్న బుద్ధిజీవి, చెమటోడిచె కష్టజీవి
చెతుల్లో చేయివేసి, చేయాలి పోరండు
మెదడున్న మేధావి, పోరన్నకు తోడండు
పోరాట దారిలోన, పోతాయి బాధలంద్రు ॥మా ప్రజల

—గద్దర్

[బ్యాలెలోని నాయన్నలారా ఏమి మీరు చిన్నబోయినారు వరుసలో
పాడుకోవాలి]

జ్ఞాపకాలు :

# చేజారిన వజ్రం



నువ్వెట్లా మా ఇంట్లోకి నడచివచ్చావో
నాకయితే ఇప్పుడు జ్ఞాపకం లేదు
నిన్ను స్నేహం వెంటబెట్టుకొని వచ్చింది
ప్రేమ నిలబెట్టింది
అభిరుచి, ఉత్సాహం, సేవ, త్యాగం పంచి
మా ఇల్లును మన ఇల్లును చేసావు
నీ ఊపిరంతా ఊది పిలిచే పిలుపు
నాలుగు వైపులా గాలిలో తేలివచ్చి
గుండెల్ని కెలుకుతున్నది
నీ రక్తమంతా రంగరించిన చూపు
వెలుగులో స్పష్టంగా
చీకట్లో సూటిగా
కళ్ళలో జ్ఞాపకాలను నలుపుతున్నది
అందరికీ తలలో నాలుకా
ఎందుకిట్లా మౌనం వహించావు
అందరికీ కళ్ళలో కాంతీ
ఎందుకిట్లా అదృశ్యమయ్యావు
ఏ దుఃఖమైనా ఏకాంతంలో కడిగేసుకొని
ఎంత బాధనైనా పెదవికింద నొక్కిపట్టి
కన్నీళ్ళు తుడిచి కబుర్లు చెప్పిన గోపీ
నీ ప్రేమ స్రవంతి ఇప్పుడు కన్నీటి కడలి అయింది
ఏదీ నీ ఓదార్పు ఒడి
నీ జ్ఞాపకం కత్తికోత అయింది
ఏదీ అమృతదరహాసస్పర్శ
ఒంటరితనమే సహించని సందడివి నువ్వు
ఎందరిలో ఒంటరితనం దిగులు మిగిల్చి
ఒంటరిగా వెళ్ళి పోయావు

ఎన్నడూ ఎవరి మనసూ నొప్పించనివానివి
ఎంతమానని గాయం చేసిపోయావు
కణంకణంగా నీ రక్తపు పోటును
మృత్యువు కూల్చేయడం చూసాన్నేను

క్షణం క్షణం నీ శ్వాసను
మృత్యువు పీల్చేయడం చూసాన్నేను
నీ పెదవులపై చిరునవ్వును
కళ్ళలో విశ్వాసాన్ని

కాలం హరించడం చూసాన్నేను
మా అందరి బతుకుపోరులో
పాలుపంచుకొని
ప్రాణాలమీదికి తెచ్చుకున్న కామ్రేడ్

నిన్ను మృత్యువు కబళిస్తుంటే
నిస్సహాయంగా చూస్తూవున్నాను
మా మధ్య నుంచి నువు వెళిపోయిన దృశ్యం
మనసు చీకటి గదిలో

తలకిందులుగా వేళ్ళాడుతున్నది
అది జ్ఞాపకం కాదు శాపం
దాన్ని తొలగిస్తాను
నీ దేహాన్ని మృత్యువు దహించింది

స్నేహాన్ని దహించగలదా
నీ ప్రేమ ప్రకాశంగా
నీ స్నేహ ప్రవాహంగా
మేమున్నాం

మాలో నువ్వున్నావు
నిన్ను మా పదిమందిలో నిలుపుకొని
మేముంటాం
నీవలె
త్యాగంతో ఉత్సాహంతో
సాగిపోతుంటాం

తన జ్ఞాపకాలు తలచుకోవడమంటే చూపుల గోళాల మీద బాధా సముద్రాలు నిలిపి పన్నెండేళ్ళ సాహితీ మిత్రుల జ్ఞాపకాల్ని తవ్వుకోవడమన్న మాట. తన గురించి మాట్లాడడమంటే ఏ క్షణాన కనురెప్పల కట్టలు తెగి దుఃఖం భళ్ళున లోకం మీద విరుచుకు పడుతుందో అని గుండెలు చిక్కబట్టుకుని ఒక ఆహ్లాదకరమైన అనుబంధాన్ని అవగాహన చేసుకోవడమన్నమాట. తన గురించి రాయడమంటే ఒక స్వచ్ఛమైన చిరునవ్వుకు, ఒక అపురూప మానవ సంబంధానికి, పని పట్ల విసుగులేని తనానికి, స్థిర సంకల్పానికి అక్షరాలు తొడగడమన్నమాట. తనతో మాట్లాడేటప్పుడు ఎదుటి వాళ్ళ ముఖం మీదికి తన ముఖం మీది నుంచి ఒక అద్భుతమైన, ఆత్మీయమైన చిరునవ్వు ప్రసరిస్తుండేది. వాతావరణంలో స్నేహ పరిమళం వీచి ఆనందమే తొణికిసలాడేది. ఇవాళ తన గురించి స్మృతి మెదిలితే అనంత విషాదం గుండెల నిండా వ్యాపించి కన్నీళ్ళ జడి మొదలవబోతోంది. కాని, ఒద్దు, తాను కన్నీళ్ళ నెప్పుడూ దరిజేరనివ్వలేదు, ముప్పై నాలుగేళ్ళ జీవితాన్ని నిండుగా చిరునవ్వుతో, ఆర్ద్రతతో, సౌహార్దంతో గడిపాడు. ఎందరికో విషాదాన్ని ఉత్తేజంగా, దుఃఖాన్ని ఆనందంగా మలుస్తూ బతికిన తన స్మృతిలో కన్నీళ్ళు కారొద్దు.

తను గోపీగా అందరి నాలుకల మీద నిలిచినవాడు. ఒద్దిరాజు గోపాలరావు సాహితీ మిత్రుడు. సాహితీ మిత్రుల కుటుంబానికి, సాహితీ మిత్రుల ఉద్యమానికి, సృజన నిర్మాణానికి తలలో నాలుక.

1973 లో ఎన్. కె. ఆయనను సృజనలోకి తీసుకొచ్చాడు. తెల్లగా, పొడుగ్గా, కళ్ళద్దాల వెనుక నుంచి తళతళలాడే చురుకైన కళ్ళతో స్వచ్ఛతకు, క్రియాశీలతకు, స్నేహానికి ప్రతిరూపంగా ఉన్న గోపీ వెన్వెంటనే సాహితీ మిత్రులలో ఒకడయ్యాడు. అప్పటికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఎస్సి. స్టాటిస్టిక్స్ మానేసి వరంగల్ ఎల్. ఐ. సి. లో అసిస్టెంట్‌గా చేరి ఉన్నాడు. సృజనకు పరిచయమయ్యేనాటికి తనకు సాహిత్యంతో ఉన్న సంబంధం తక్కువే. ఎందరినో సాహిత్యకారులుగా మలిచిన సృజనే, సాహితీ మిత్రుల్లో ఉమ్మడి ఆచరణే గోపీని కూడ మంచి అనువాదకుడిగా తీర్చి దిద్దాయి. అప్పటికి తనకు విప్లవంతో పరిచయమూ తక్కువే. వరంగల్ జీవితంలో ఎన్. కె. దే ప్రధాన ప్రేరణ. తెలంగాణ ఉద్యమంలో విస్ఫోటనమయిన అసంతృప్త యువతరంలో తానూ ఉన్నాడు గాని తన రంగం ఎప్పుడూ మిలిటెంట్ ఆచరణ కాదు. హైదరాబాద్ జీవితంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం, జార్జిరెడ్డి ప్రధాన ప్రేరణలు ఏమైనా, మళ్ళీ సృజన ఆచరణే, గత పన్నెండేళ్ళుగా పరిమా

ణాత్మక గుణాత్మక మార్పులు పొందుతూ నిర్మాణమవుతున్న వరంగల్ చరిత్రే తనను దృఢంగా సృజనతోనూ, విప్లవంతోనూ నిలబెట్టాయి.

1974 మేలో సికింద్రాబాదు కుట్రకేసు కింద వి. వి. అరెస్టయ్యాక 'సాహితీ మిత్రులు' ఒక సమష్టి కృషిగా దాని పూర్తి అర్థంలో ఆచరణలోకి వచ్చి సృజన నిర్వహణను చేపట్టింది. అప్పటి వరకూ వి. వి. తో పాటు ఒక రిద్దరు మిత్రులు కలిసి కొన్ని రచనలు చదివి, చర్చించి, మార్పులు, చేర్పులు చేసి ప్రచురించే సాంప్రదాయం 1974 మే తర్వాత ఒక రెగ్యులర్ 'సా. మి.' సమావేశాల సాంప్రధాయంగా మారింది. సాహితీ మిత్రులందరూ కూచుని, ప్రతి రచననూ చదివి, చర్చించి, సృజన సంపాదకత్వాన్ని సామూహికం, సామాజికం చేశారు. సృజన పుట్టుక నుంచీ సంపాదకత్వ ప్రజాస్వామికీకరణ గురించి ఉన్న అవగాహన స్పష్టమై ఒక నిర్దిష్టమైన నిర్మాణ రూపం ధరించింది. ప్రతి సంచికా మొదటి కవర్ నుంచి చివరి కవర్ దాకా సాహితీ మిత్రుల ఉమ్మడి కృషి ఫలితంగా రూపొందడం మొదలైంది. ఈ సామూహిక సాహిత్య ప్రయత్నం అప్పటికి "సాహిత్య వాసన"లే లేని ఎందరినో మంచి సాహిత్య కారులుగా సాన పట్టింది. సాహిత్య సృష్టిలోనే కాదు, సాహిత్య ఎంపికలోనూ ప్రజాస్వామికీకరణ ఎంతటి అద్భుత ఫలితాలనివ్వగలదో స్పష్టమైంది. ఈ నేపథ్యంలో సాహితీ మిత్రుడిగా ఎదిగి గోపీ సాహిత్య సృజన, అను సృజన ప్రారంభించాడు.

1974 మే సంచిక నుంచి 1975 జూన్ సంచిక, ఎమర్జెన్సీ ముందు ఆఖరి సంచిక, వరకు ఏడాది పైగా ఈ బృందం సమష్టి కృషిలోనే సృజన వెలువడింది. ఈ బృందంలో గోపీ ప్రధానమైన, బాధ్యతాయుతమైన పాత్ర నిర్వహించాడు. ఈ బృందం ఎలా ఉండేదంటే, అప్పుడు సాహిత్యకారులపై అమలయిన దారుణ నిర్బంధంవల్ల సృజనకు బైటినుంచి ఒక్క రచన రాక పోయినా, మొత్తం సంచికను బృందం స్వయం శక్తితో నడపాలనే పట్టుదల మీద ఉండేది. పౌరహక్కుల ఉద్యమానికి వేదిక లేని ఆ దశలో, విప్లవోద్య మానికి కూడ చాలినన్ని వేదికలు లేని ఆ దశలో సృజన ఆధునిక సాహిత్య వేదికగా మాత్రమే కాక పౌరహక్కుల, విప్లవోద్యమ అవసరాలు తీర్చే వేదికగా కూడ ఉండాలనే అవగాహనతో ఈ బృందమే సృజనలో రిపోర్టులు, ప్రకటనలు వార్తలు వంటి పత్రికా రచనకు చోటిచ్చింది. విప్లవోద్యమం ఒక తాత్కాలిక అపజాయానికి గురైన స్థితిలో ఉన్నప్పుడు ఉత్తేజం కోసం, ప్రేరణకోసం ఇతర దేశాల, ముఖ్యంగా చైనా విప్లవోద్యమ అనుభవాల్ని ప్రచురించాలని కూడ ఈ బృందం నిర్ణయించింది, ఈ అవసరం తీర్చేందుకే గోపీ మొట్టమొదటి సారిగా

అనువాదం ప్రారంభించి చైనా కథలు అనువాదం చేశాడు. మొదట సృజనలో ప్రచురితమైనప్పుడూ, ఆ తర్వాత క్రాంతి ప్రచురణ 'నేలతల్లి చెర విడిపించిన లాంగ్ మార్చ్-చైనా కథలు'లో ప్రచురితమైనప్పుడు ఈ కథలు ఎందరినో ఉత్తేజ పరిచి గొప్ప ప్రేరణ నందించాయి.

ఎమర్జెన్సీ తర్వాత ఎక్కువగా రిపోర్టులు, లేఖలు, పుస్తక సమీక్ష, వ్యాసం వంటి ప్రక్రియలు మాత్రమే అనువదించిన గోపీ 1981 సెప్టెంబర్ సంచికలో లూసన్ కథ 'కనుమ దాటడానికి' తెలుగు చేశాడు.

ఎమర్జెన్సీ తర్వాత గోపీ అనువాదాలు, చేస్తూనే, సాహితి మిత్రుల సమావేశాల్లో చురుకుగా పాల్గొంటూనే ప్రధానంగా సృజన నిర్వహణ బాధ్యతలు స్వీకరించాడు. రోజువారీ నిర్వహణ నుంచి, నెలవారీ ప్యాకింగ్, పోస్టింగ్ దాకా అన్ని పనులూ చేసేవాడు. ఎప్పుడూ ఎవరో బాధ్యతలు ఇస్తేనే తాను చేయాలని ఆయన అనుకోలేదు. బాధ్యతలు పంచుకుని, పనులు అడిగి తీసుకుని చేసేవాడు. ఆఫీసుకు వెళ్ళివచ్చి రోజు వారీ బాధ్యతలు చూడడమన్నా, నెలవారీ ప్యాకింగ్ కోసం నిద్రకాచి ఒక రాత్రంతా కూచోవడమన్నా తన ఆరోగ్యం దృష్ట్యా తాను చేయవలసిన పనులేమీకావు. ఇలాంటి మామూలు అలసట ఇచ్చే పనులు మాత్రమే కాక, సభల్లో సృజన పుస్తకాల స్టాల్ కోసం ఎక్కడికయినా తాను కట్టలు మోసుకు పోయేవాడు. 78 చీరాల విరసం, 79 ఖమ్మం ఆర్.వై.ఎల్. 82 మాచెర్ల విరసం సభలకు తానే పూర్తి బాధ్యత వహించి పుస్తకాలు మోసుకొచ్చాడు. తన ఆరోగ్యం కాపాడడానికి, తన శరీర దార్ఢ్యం దృష్టిలో ఉంచుకుని సాహితీ మిత్రులే ఎప్పుడూ తనకు శ్రమ తగ్గించడానికి ప్రయత్నిస్తుండేవారు. 84 నుంచి తనకు దాదాపుగా కష్టతరమైన పనులన్నిటి నుంచీ, అలసట కలిగించే పనులన్నిటి నుంచీ రిలీవ్ చేశారు. ఐనా మళ్ళీ అందరూ ఏదో పని తొందరలో ఉన్నప్పుడు తానూ పనిలోకి దిగిపోయేవాడు. అయితే ఇది ఎగ్జిబిషనిజం కాదు, పని చేస్తున్నానని ఎప్పుడూ ఆర్భాటం చేసేవాడు కాదు. మౌనంగా తన బాధ్యతను తాను నిర్వర్తిస్తున్నట్టుగా మాత్రమే పని చేసుకుపోయేవాడు. విప్లవంతో తనకు ఉన్న ఒక్క సంబంధంలోనూ తనను రిలీవ్ చెయ్యొద్దనే కోరికను ప్రతి క్షణమూ ఆచరణలో ప్రతిఫలించేవాడు. సృజన చందాల క్యాంపెయిన్ తీసుకున్న ప్రతిసారీ అతి ఎక్కువ చందాలు చేయించిన వారిలో తాను మొదటివాడు. అందుగురించి మాటలు చెప్పడంలో మాత్రం తానెప్పుడూ వెనకే.

పని చేస్తూ ఎగ్జిబిషనిజం లేకపోవడం అనే గొప్ప సుగుణం గోపీని ఎందరికో మెత్తని మనిషిగా, మంచి మిత్రుడిగా దగ్గరికి చేర్చింది గాని, ఆ వినయమే ఆయన ఎంత విలువైన వాడో సన్నిహితులకు తప్ప ఇతరులకు తెలియకుండా చేసింది. సా.మి. కి మాత్రమే తెలిసిన ఆయన శక్తి, దీక్ష సృజన వెనుక అజ్ఞాతంగానే మిగిలిపోయాయి.

జీవితంలో దెబ్బలు తాకినప్పుడు ఎంత ధైర్యంగా తట్టుకొని నిలిచాడో గమనిస్తే గోపీ తన విశ్వాసాలను తన వ్యక్తిగత జీవితంలో తనకు వీలయిన మేరకు ఎంత బలంగా ఆచరించాడో అర్థమవుతుంది. ఉపనయనం కాకుండా పెళ్ళి చేసుకున్నందుకు, తమకు ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నందుకు ఆయనను బంధులోకం కొంతకాలం పాటు దాదాపు వెలివేసింది. ఆయన ఆత్మీయులే కొంతకాలంపాటు పరాయి వాళ్ళుగా ఉండిపోయారు. వాళ్ళలెక్కెంత అని అటు కొసకూ పోక, వాళ్ళతో మంచి సంబంధాల కోసం తన విశ్వాసాలను వదులుకునే ఇటు కొసకూ పోక, ఓపికగా తన విశ్వాసాలు ఎలా మంచివో వాళ్ళను ఒప్పించాడు. తనకు చాల ఇష్టమయిన తన తోబుట్టువులూ, తల్లిదండ్రులూ రెండు మూడు సంవత్సరాలపాటు సరైన సంబంధాలలోకి రాకపోయినా బాధను మౌనంగా దిగమింగుతూనే ఓపికగా తన ప్రయత్నం కొనసాగించాడు. ప్రతి విషయంలోనూ ఈ ఊగిస లాటలు లేని, ఖచ్చితమైన దృక్పథం ఆయన వ్యక్తిగత, సామాజిక జీవితంలో కనబడుతుంది. 1979 లో కొడుకు పుట్టి కొద్ది రోజులు బతికి చనిపోయినప్పుడైనా, పోలీసు రిపోర్టు వ్యతిరేకంగా ఉన్నదని అరుణ ఉద్యోగం పోయినప్పుడైనా, ఒక ఆసుపత్రి కాదంటే మరో ఆసుపత్రి చుట్టూ, ఆయుర్వేదం నుంచి ప్రకృతి చికిత్స దాకా బ్యాంకైయాక్టిస్ చికిత్స కోసం తిరుగుతున్నప్పుడైనా, ఎప్పుడూ తాను ధైర్యం కోల్పోలేదు. తనకు ధైర్యం చెప్పడానికి వచ్చి బేలగా మారిన వారికే ధైర్యం చెప్పాడు.

చివరికి 80 లో తన ఇంట్లో ఉంటున్న మరో సాహితీ మిత్రుడి కోసం మఫ్టీలో పోలీసులు వచ్చి, ఓ అపరాత్రి వేళ తలుపుతట్టి, తమను గోపీ ఎవరని, మీ ఐడెంటిటీ ఏమిటి అని అడిగాడని కోపించి రివాల్వర్ చూపినా ఆయన గుండె సడలలేదు. వరంగల్‌లో ఒక డాక్టర్ తన జబ్బు ఇంక నయం కాదని, చాల నిరాశా జనకంగా మాట్లాడినా, మనసులో ఏమనుకునే వాడో గాని, పైకి ఆ డాక్టర్ నైపుణ్యాన్ని అపహసించి, ఎందరికో ధైర్యం కలిగించాడు. బ్రాంకోగ్రామ్ చూపుతూ ఊపిరితిత్తుల్లోని ఏ భాగం శస్త్రచికిత్స చేసి కత్తిరించి వేస్తారో సరదగా చెపుతుండే వాడు.

నిర్బంధంలో ధృఢంగా ఉండే తన లక్షణమే తనకు సృజనకు మరింత దగ్గర చేసింది. ఎమర్జెన్సీలో వరంగల్‌లో అమలయిన భయానక వాతావరణంలో కూడా సృజనతో ధృఢంగా నిలబడ్డ సహచరుడు గోపి. సృజనకు తను రెగ్యులర్‌గా వచ్చాడు. సృజన కుటుంబానికి అండదండగా నిలబడ్డాడు. ఎమర్జెన్సీ చీకట్లోనే, సృజన కార్యాలయంలో 1976 డిసెంబర్ 26 న అరుణతో ఆయనకు ఆదర్శ వివాహం కాశోజీ చేసారు.

ఎమర్జెన్సీకి ముందూ, తర్వాత కూడ ఒకవైపు సృజనలో క్రియాశీలంగా పాల్గొంటూనే మరోవైపు ఎల్.ఐ.సి. ట్రేడ్ యూనియన్ రాజకీయాలలో నాయకుడయ్యాడు. ట్రేడ్ యూనియన్ల గురించి విప్లవోద్యమపు అవగాహనే స్పష్టాస్పష్టంగా ఉన్నరోజులలో తన చైతన్యం మేరకు ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలలో విప్లవకారంగా పాలుపంచుకున్నాడు. తన చొరవతోనే వరంగల్ ఎల్.ఐ.సి. ఎంప్లాయీస్ యూనియన్ రచయితలపై కుట్రకేసును ఖండించే 'సాహసం' చేసింది. అదే యూనిట్ వరంగల్‌లో నిర్వహించిన జోనల్ కాన్ఫరెన్స్‌లో 'పౌరహక్కుల ట్రేడ్ యూనియన్ ఉద్యమం' అంశంపై ఒక చర్చ ఏర్పాటు చేసి, మొక్కుబడిగా జరిగే సమావేశాన్ని కూడ ఉత్తేజంతో నింపగలగడం గోపీ ప్రోద్బలం వల్లనే జరిగింది. ట్రేడ్ యూనియనిజం మీద చదవాలనీ, ఆ రంగంలో కృషి చేయాలనీ తాను ఎప్పుడూ అనుకుంటూ ఉండేవారు.

ట్రేడ్ యూనియన్, విప్లవోద్యమాల వంటి వ్యావృత్తులతో పాటు గోపీ నిలబెట్టుకున్న అభిరుచులు చాల వైవిధ్యం కలిగినవి. నాటకాలలో నటన, సినిమాపై ఆసక్తి, చదరంగం, క్రికెట్, బ్రిడ్జ్‌వంటి ఆటల్లో ప్రవేశం, ప్రావీణ్యం.

కామ్రేడ్ గోపీ ఒక సున్నితమైన ప్రేమాస్పదుడు. ఒక విలువైన స్నేహితుడు, ఒక అజ్ఞాత శక్తి, ఆచరణలో తప్ప మాటలో వ్యక్తీకరణ పొందని కృషి, కామ్రేడ్ గోపీ మరణంతో సాహితీ మిత్రులు ఒక సున్నితమైన పువ్వును విలువైన వజ్రాన్ని కోల్పోయారు. గోపీ వంటి మనుషులు స్మృతులలో ఎప్పుడూ మరణించరు గనుక మా గుండెలలో లోటు తెలియదు. కాని మా నిర్మాణంలో, మా భౌతిక జీవితంలో ఈ లోటు నానాటికీ మరింత స్పష్టంగా కనబడడం మొదలవుతుంది. జబ్బులను-అవి ఎంత భయంకరమూ, దీర్ఘకాలికమూ అయినా తొలగించే, ఆ మూలాగ్రం నిర్మూలించే, అసలు రాకుండా నిరోధించే ఆరోగ్యకరమైన సమాజం కోసం సృజన చేసే ప్రయాణం, సృజన పాలుపంచుకునే విప్లవ కృషి ఈ లోటుని పూరిస్తుంది. ఆ ప్రయాణమే కామ్రేడ్ గోపీని, మా గోపీని సాహితీ మిత్రుల్లో సజీవంగా ఉంచుతుంది.

1-10-85

# ....తీపి గుర్తు

ఎస్. కె.

పాటా పాడామంటె చెల్లెలా
ఏమని పాటా పాడుదునే చెల్లెలా
పదమూ పదమూ గూర్చి చెల్లెలా
ఏ జ్ఞాపకాల మాల కడుదె చెల్లెలా

అడుగూ అడుగూనందు చెల్లెలా
వాడగుపించి పల్కరించు చెల్లెలా
ఏ పల్కరింపు నవ్వుదీసి చెల్లెలా
నీ పెదవి కందింతునమ్మ చెల్లెలా
మాటా మాటా నంప చెల్లెలా
వాని మాటా దొర్లునమ్మ చెల్లెలా
ఏ తొల్కరింపు జల్లుదీసి చెల్లెలా
నీ కంట నీరు కడుగుదమ్మ చెల్లెలా
చూపూ చూపూ నందు చెల్లెలా
వాని రూపూ గట్టేనమ్మ చెల్లెలా
ఏ రూపు దీసి రంగరించి చెల్లెలా
నీ చూపులకు రూపునిత్తు చెల్లెలా
రేపు మాపు చీకటైనా చెల్లెలా
నా గోపి గాని తీపిగుర్తు చెల్లెలా
ఏ గుర్తు తీసి మాల గుచ్చి చెల్లెలా
నీ బతుకు పూలమాల జేతు చెల్లెలా
లోకాల శూన్యమంత చెల్లెలా
నీ శోకాన ఉన్నదే చెల్లెలా
నీ సుఖాలు కోరినోడు చెల్లెలా
ఈ దుఃఖాలు ఓర్వలేడు చెల్లెలా
కార్చి కార్చి కన్నీరు చెల్లెలా
వాడ్ని కారిపోనీయకె చెల్లెలా

సంస్మరణ :

# కామ్రేడ్
# పాలకుర్తి ఐలమ్మ



తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం మొదలు కావడానికి కొద్ది ముందుగా విసునూరు రామచంద్రారెడ్డికి వ్యతిరేకంగా దృఢంగా నిలిచి, పోరాడి, తెలంగాణ విమోచనోద్యమపు తొలి నిప్పురవ్వలలో ఒకరుగా, ఆ కాలపు భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు ప్రేరణగా నిలిచిన కామ్రేడ్ ఐలమ్మ ఎనభై ఐదేళ్ళ వయసులో సెప్టెంబర్ 10 న పాలకుర్తిలో మరణించారు.

తెలంగాణ విమోచనోద్యమ కాలంలో కామ్రేడ్ చిట్యాల ఐలమ్మ కుటుంబం పాలకుర్తి గ్రామంలో సంఘానికి పట్టుగొమ్మగా ఉండేది. ఊళ్ళోకి సంఘాన్ని తెచ్చి, సంఘ నాయకులుగా నిలిచిన నేరానికి ఐలమ్మ భర్త నర్సింహ్మ, కొడుకులు సోమయ్య, లచ్చయ్య కుట్ర కేసు ఆరోపించబడి ఏడాది పాటు జైలులో మగ్గవలసి వచ్చింది. దారుణమైన చిత్రహింసలకు గురి కావలసి వచ్చింది. ఆ కుటుంబం తరతరాలుగా సాగు చేసుకుంటున్న భూమి నుంచి పంటను కోల్పోయే ప్రమాదం వచ్చింది. ఎన్ని కష్టాలు, ఇబ్బందులు ఎదురైనా భూమి కోసం, భుక్తికోసం, దొరల సాంఘిక పీడన నుంచి విముక్తి కోసం అవిరామంగా

---

ఏడ్చి ఏడ్చి ఏడ్చి ఏడ్చి చెల్లెలా
వాడ్ని ఇంకి పోనీయకె చెల్లెలా

ఏమీ చేద్దామంటె చెల్లెలా
నేనేమీ చెప్పేదమ్మ చెల్లెలా
ఎర్ర జెండ నమ్మినోణ్ని చెల్లెలా
దాన్ని ఎత్తు ఎత్తు ఎత్తుదామె చెల్లెలా

నడలని దీక్షతో సాగించవలసిన పోరాటానికి ఉదాహరణగా కా[మేడ్ ఐలమ్మ నిలిచింది.

అప్పటి జనగామ తాలూకా పాలకుర్తిలో 1944 ఏప్రిల్‌లో ఆంధ్ర మహాసభ ఆధ్వర్యాన గ్రంథాలయ ప్రారంభోత్సవం నిర్ణయించబడింది. పరిసర గ్రామాలన్నిటి నుంచీ ప్రజలు, సంఘం కార్యకర్తలు పాలకుర్తికి చేరుకున్నారు. సభను విచ్ఛిన్నం చేయడానికి, నాయకులను హత్య చేయడానికి విసునూరు దొర కూడ తన గూండా దళాన్ని పాలకుర్తికి పంపాడు. ఒక వైపు గూండాలు, మరో వైపు పోలీసులు తిష్టవేసిన ఆ ఉద్రిక్త పరిస్థితిలో సంఘ నాయకులు బహిరంగ సభను రద్దు చేసి కార్యకర్తల సమావేశం మాత్రం ఏర్పాటు చేశారు. సమావేశం తర్వాత కార్యాలయం ఆవరణలోనే చెప్పించిన బుర్రకథ వినడం కోసం వేలాది మంది ప్రజలు కూచుని ఉండగా విసునూరు దొర గూండాలు విరుచుకు పడ్డారు. ఒనమాల వెంకని నాయకత్వంలో సాగిన ఈ దాడిలో బరిసెలు, గుతుపలు యథేచ్ఛగా ఉపయోగించారు. జనాన్ని పొడుస్తూ, కొడుతూ భీభత్సం సృష్టించారు. కొద్ది నిమిషాల్లోనే తేరుకున్న జనం తిరుగబడ్డారు. తిరగబడ్డ జనం చేతిలో ఆ తప్పతాగిన గూండాలు ఓటమినే చవి చూశారు. ఒనమాల వెంకనితో సహా కొందరు గూండాలకు తగిన శాస్తి జరిగింది.

ఈ ఘటన తర్వాత పోలీసులు పాలకుర్తి కుట్ర కేసు బనాయించి 12 మందిని అరెస్టు చేశారు. ఒనమాల వేంకనిపై హత్యా ప్రయత్నం చేశారని ఆరోపించారు. ఈ కేసులో ఐలమ్మ భర్తను, కొడుకులను అరెస్టు చేశారు. జనగామ మున్సిఫ్ కోర్టు, మెదక్ సెషన్స్ కోర్టులలో ఏడాది పాటు విచారణ జరిగింది. విచారణ కాలంలో నిందితులెవరికీ బెయిల్ ఇవ్వలేదు.

పాలకుర్తి కుట్ర కేసు అరెస్టుల తర్వాత జనగామ తాలూకా రైతాంగ పోరాటాల మీద భూస్వాములు, పోలీసులు ఒక్కుమ్మడిగా విరుచుకు పడి 35 గ్రామాలలో భయ భీతావహం సృష్టించారు. ప్రజల మీద దాదాపు 100 దొంగ కేసులు బనాయించారు. ఈ దమన కాండలో భాగంగానే ఐలమ్మ పంటను స్వాధీనం చేసుకునేందుకు విసునూరి దొర ప్రయత్నించాడు.

చాకలి ఐలమ్మ కుటుంబం ఆ నాలుగెకరాల మడి చెక్కను తరతరాలుగా సాగు చేసుకుంటున్నది. ఆ భూమికి అసలు మక్తెదారు మల్లంపల్లి దేశముఖ్. కాని పాలకుర్తికి సంఘాన్ని తెచ్చిన ఐలమ్మ కుటుంబంపై కక్ష బూనిన

విసునూరి రామచంద్రారెడ్డి ఈ భూమిపై కూడ కన్ను వేశాడు. ఆ కక్షలోనే ఐలమ్మ భర్తను, కొడుకులను కుట్ర కేసులో ఇరికించాడు. చివరికి ఐలమ్మ ఒంటరిగా ఉన్నప్పుడు పంటను స్వాధీనం చేసుకోవాలని కుట్రపన్నాడు.

కాని అప్పటికి ఐలమ్మ ఒంటరికాదు, సంఘ నాయకురాలు అయింది. గుడిసెపై ఎర్ర జెండా ఎగరేసి తన ఇంట్లోనే సంఘం కార్యాలయం పెట్టింది. సంఘ నాయకులకు ఆశ్రయమిచ్చింది, కబళం అడుక్కొచ్చి తిండిపెట్టింది. అందుకే ఐలమ్మ పంటను దొర నుంచి కాపాడడానికి సంఘమూ, ప్రజలూ ముందుకొచ్చారు. ఏదేమైనా సరే, పంటను దొరకు దక్కనివ్వగూడదని, దొర దౌర్జన్యాన్ని ఎదిరించి నిలవాలని ఐలమ్మ పూనిన దృఢదీక్ష పరిసర గ్రామాల ప్రజలకు ఉత్తేజాన్నిచ్చింది. జనగామ తాలూకా భూస్వామ్య వ్యతిరేక ఆకాంక్ష లన్నీ ఐలమ్మ పంట రక్షణకై పాలకుర్తికి కదిలి వచ్చాయి. ప్రజలు, సంఘం వలంటీర్లు ఒక వైపు దొరల గూండాల దాడిని తిప్పి కొడుతూనే, మరో వైపు పంట కోసి సురక్షితంగా ఇల్లు చేర్చారు. గూండాలు వెనకడుగు వేసిన తర్వాత విసునూరు పోలీసు స్టేషన్ నుంచి పోలీసులే స్వయంగా వచ్చి సంఘం వలంటీర్లను, ప్రజలను అరెస్టు చేసి దొమ్మీ కేసు పెట్టారు.

దొరల ఇళ్ళలో కాళ్ళు ఒత్తడం నుంచి ప్రయాణాలకు బళ్ళముందు పరుగెత్తేదాకా ఎన్నెన్నో పనులు చేయవలసిన కులంలో పుట్టి, భూస్వామ్య పీడనను, దౌర్జన్యాన్ని అనుభవించి, చిన్న మెత్తు ప్రతిఘటనకు సాహసించినందుకు దారుణ దమనకాండకు గురై ఎడాది పాటు భర్తకూ కొడుకులకూ దూరమై ఒంటరిబతుకు గడపవలసి వచ్చినా సడలని పోరాట పటిమతో భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని సాగించిన కామ్రేడ్ ఐలమ్మ తెలంగాణ విమోచనోద్యమంలో ఒక మైలు రాయి. భారత నూతన ప్రజాస్వామిక విప్లవపు సుదీర్ఘ పథంలో కామ్రేడ్ ఐలమ్మ పోరాట జీవితం నిత్యం ప్రేరణ నిచ్చే శక్తిగా నిలుస్తుంది.

కామ్రేడ్ ఐలమ్మ అరుణారుణ స్మృతికి సృజన విప్లవ జోహార్లు ప్రకటిస్తోంది.

—సాహితీ మిత్రులు

# ఐలమ్మ దృక్పథంలో ఐలమ్మ

నా పేరు చిట్యాల అయిలమ్మ. చిట్యాలోల్లంటరు. నా పెనిమిటిదేంలేదు. నా కొడుకులదేంలేదు. ఎక్కడ పోయిన ఏం జేసిన ముందుగ నాపేరే జెప్తరు. ఎక్కడ పోయిన ఏం జేసిన ముందుగ నాపేరే జెప్తరు. ఎప్పటి కొత్తనే వుంటరు సంగపోల్లు.

రాంగనె వూరికి బండ్లు కట్టిన్రు. కట్టెవరకు ఐసూర్నుంచి యం ముత్యం వచ్చిన్రు. వచ్చి కలియబడ్డరు. కలబడి కత్తుల సోములయ్యను పట్టుకున్నరు. పట్టుకుంటె మాపటికి మల్లొచ్చి ఏదొ సగ జెప్పిన్రు. సగ జేప్తె ఏమొ అనుకున్న ఇట్లయితదంటె ఎర్కలేదు. ఓ.... ఇంత దూరం అంత దెలిసొచ్చింది. ఓ నారంకయ్య యిగ అక్కడ శారదాంబింటికాడ సదువు జెప్తాన్రు. ఇగ నీబాంచ నయితే కట్టెలు అన్నొచ్చినయి. ఇస్కనలిగాడు గుమాస్తాలు అబ్బనలియ గుత్తా రం రామిరెడ్డిగాడు వాడు జేసిన్రు. ఓ.... నీ బాంచనయితే యిగ కతకత జేసిన్రు. మేం కొట్టాలేసుకుంటె కొట్టా విప్పేసిన్రు. దున్నుకున్నం. చేసినం. అన్ని ఆగంజేసిన్రు. గడ్డపాయన దున్నుకున్న జాగల ఏడెకరా లపరాయించిన్రు. అరువు దీసుకున్నడు. షెల్కలు దీసుకుండు. చేన్లు దీసుకున్నారు. వాళ్ల ముగ్గురు తండ్రి కొడుకులను అక్కడ దీస్కపోయిన్రు. మమ్ముల ఆగంజేస్తాంటె నిర్మాలోల్లు, బేగరూపోల్లు, కడేందోల్లు. సీతరాంపురపోల్లు వీల్లంతొచ్చి నాయిల్లు కావలున్నరు. యింటినిండిత్తులున్నయి. ఆ సందుం వడ్లున్నయి. అంతొచ్చి ఆగ మాగం జేస్తుంటె వాళ్లొచ్చి అంత కావలున్నరు. మూణ్నాల్నెల్లున్నరు. వుంటె వూరిమీద కూడు అడుక్కొచ్చి పెట్టిన. రెండు పేర్పుల నల్ల చేసి పెట్టిన. అంద కుంటె అది వోస్క తిన్నరు నా తండ్రులు. అన్నం అందకుంటె గట్క పెట్టు కుని నల్ల పోసుకుని తిన్నరు. తిని నాల్గునెల్లు కాపు కాసిన్రు. కాపు కాసి కాసి వచ్చేవరకు మల్లిపోయిన్రు. అల్లు మల్లివోయినంక వచ్చి యింటికి నిప్పుపెట్టిన్రు. ఏదుం సర్దలు, యెనుమందు పెసల్లు పోస్కపోయిన్రు. నువ్వులు గాన్గ గట్టించు కుంటమనే తెచ్చిన నువ్వులు పోస్కపోయన్రు. ఇక నేతి పటవలయితే వాళ్లయితే అక్కన్నే పోయిన్రు గద. ఇంతింత పటవలు పక్కన పలగగొట్టిన్రు. పెళ్లలను పెళ్లలే తీసుకుని తినుకుంట పోయిన్రు. బండ్లు గట్టిచ్చుకుని అవి దీస్కపోయిన్రు, అయ్యగారింటికి నిప్పుపెట్టిన్రు. ఇగ నా బిడ్డను దొరికిచ్చుకున్నారు. నేన్దొరక లేదుగని నా బిడ్డన్దొరికిచ్చుకున్నారు. ఏమో జీనంజి నర్సయ్య కడుపు నల్ల

గుండ వాడు పట్టిచ్చిండు. పట్టిస్తే మూణ్నెల్ల. నాదంతా యేసి గుద్దుతాంటె
తుపాకి మొదల్లోనె గుద్దుతాంటె తంతాంటె వో.... వోకటే బట్టలమీద బట్ట
లిడిసిన. శివారెడ్డి అదేందో అయన పేరేందో. వుండె. పోలీసు బూడుగులాయిన
శివాద్రి ఆ అయన కడుపు సల్లగుండ వొచ్చి వాల్లను యెటంటె అటన్నడు. ఆ
పోరి అప్పుడు సచ్చేదేవుండె, ఓ.... అగంగాదు. నీ బాంచను ఎం జెప్పాలె.
ఒక్క కుండ లేకుంట, వొక్క గాబులేకుంట, గోశెం లేకుంట అన్ని పల్ల
గొట్టిన్రు. పల్లగ్గొట్టి యింటికి నిప్పు పెట్టిన్రు. తూర్పింటికి నిప్పు పెట్టిన్రు.
పెడుతుండె వరకు యీ అమీను మోతుకూరమీను కడుపు నిండ కనుకున్నదో
లేదో వచ్చిండు. ఇంత యిల్లు గాలిపోతె యెట్లయితదీ అని యెట్లని వొక్క
గోలెంల నీళ్లున్నయి. పెంకలతోని దబ్బదబ్బ తీసిపోసిండు. బుడ్డెడాముదం
పోసిన్రు. మీదమీదకి యెగగొట్టి కాలబెట్టిన్రు. అందం పోసి కాలబెట్టిన్రు. పొయ్యే
టప్పుడు. అయనొచ్చి సల్లార్పిండు. యిగ కమ్మరాయన పొయినంక యిగ
యిట్లనే ఆగంజేసిన్రు. జేస్తాంటె దున్నుకునే పొలం పోయింది. దున్నుతుంటె
మాది అముక్తదారు మాకిచ్చిండు. మా దొరవారు మా దొరసాని మాకిచ్చిన్రని
మమ్ముల అగమాగం అడివడివి జేసిన్రు. చేస్తుంటె యిసునూరి మాల్పటేల్
తీస్కపోయిండు. వాళ్లు వాళ్లు యిప్పుడు జెయ్యొద్దు సేపొద్దంటె పందుం యిత్త
నాలు వోసినం. దండగ గట్టి 360 రూపాయలు సేతుల పోసిన్రు. వాళ్లు పొయి
నప్పటికైన పందుం యిత్తనాలు పోసినం వాళ్లు వద్దంటె యిగ తండ్రికి పుట్టినో
డయితె జెయ్యడు గాని పినతండ్రికి పుట్టినోడయితె జేస్తాడు. అని అట్నే అను
కుని పూరుకున్నం. నాయినా నాటు వెట్టే సమయానికి మల్లా వచ్చిన్రు. మల్లా
దున్ననియ్యలే. ఇగ యింత పాపమని సోమిల్ల బుచ్చయ్య కాదు పెద్ద మల్లయ్య
అయన్నెంట బెట్టక పోయిన్రు పట్నం. పట్నంలో వున్నడు దొర. సెంచోల్ల
దొర. ఆ దొర మలక్పేట్లున్నడు. సెంబోల్ల బంగ్లమీదున్నడు. ఆ బంగ్లమీదకు
పోయినం.

పన్నెండు కచ్చీర్లు దిరిగిన. నీ బాంచెను కాల్మొక్త. పట్నంల అన్ని
దిరిగిన, అయ్యో.... యింకేందో యేందో అన్ని దిప్పిన్రు. తిప్పె పోయిన అంత
వోయిన గద. నేను యేణ్ణున్న దొరికితె సంపుదురు. జనగాం వొక్కదాన్నె
పొయ్యేది, వొక్కదాన్నె వచ్చేది. నీది నువ్వే జేసుకపో బిడ్డా యిగ మేంలేదు.
రామిరెడ్డిగానికి బుద్ధి వానికి జెప్తానని కాయితం రాసిస్తే అది తీసుకోని వొచ్చిన.
మల్లొచ్చినంక యిగ నాట్లేసినం. నీల్లు పెట్టుకున్నం అన్ని జేసినం వరి పోలం
మాంచిగొచ్చింది. ఒక పాన్పు వెదల్పు పోసిన్రు. వచ్చిన్రు వొక్క పాన్పు
పోసేకల్ల. కాని మల్లయ్య పోసే వరకు వచ్చి పదాలు వాడుకుంట యిగ

యేనంగనో వురి కొచ్చిన్రు. యిగ వడ్లెక్కడ బోయినవో. నాలుగు పుట్ల వడ్ల య్యేవి, ఆ వడ్లెక్కడ బోయినయో, మన్నెక్కడ బోయినయో, ఇగ రెండు వంపుల్ల ఆ రెండు వంపుల్ల సొంతం అంత మడికిమడే యెక్కడిక్కడ అంత యే మడికామడే కొట్టుకున్నరు, కోసుకున్నరు, పోయిన్రు. అయితే మల్ల నేను పట్నంపోయిన. గిట్లయితుందని మల్ల పట్నం బోతె లచ్చిమి నరసిమ్మరెడ్డి అందర్ని యెంటవెట్టుకోని వచ్చిండు. వచ్చి నేను మీకు మంచిగ యింత పావం యెట్లయితది. అని అడుగుదామనొచ్చిండు. వచ్చి వాకాడ నా యింటికాన్నె బండి యిడుసుకున్నడు. అన్ని సామాన్లు, సావలు, చెత్తంత గొంగళ్ల గింగళ్ల అన్ని సామాన్లేసుకుని యిస్కంపోతమని పోయిన్రు. నిర్మాల రామిరెడ్డి బండి, యెడ్లు అదేంది షాపూరోల్లు, మావూరోల్లు, ఆ వూరోల్లో పదిమంది గూడిన్రు, పోయిన్రు, పోయేవరకు వాకాణ్నె దొరికిచ్చుకుని కొట్టిన్రు కదమ్మా.... నీ బాంచెను. రోకటితోని గుద్దినట్టే. ఇంతింత యెదల్పు బొడ్డుమీద యింతింతెదల్పు రక్తాలు గారినయి. లాగులిడిపిచ్చుకున్నరు. గుంజిన్రు. అంగిలిడిపిచ్చుకున్నరు. అవేయివి బండి బావులకు గుంజిన్రు. అంతిప్పిన్రు, బండి గాల వెట్టిన్రు. కమ్మలు అండ్లొ దొక్కిన్రు. ఎడ్లను హన్మకొండకు దోలిన్రు. గంత ఆగం జేసిన్రు. మా ఆగం యెట్లండాలె, ఇంతింత జనిమోటర్లు గొట్టు కొచ్చిన్రు. వాని కడుపుగాల: జెనిమోటర్లు గొట్టు కొచ్చి వాని కడుపుగాల 600 రూపాయలు దండుగ వెట్టిచ్చిన్రు. వాల్లు జైల్లల్లుండంగనే మమ్ముల యింతపని నన్ను జెసిన్రు. నాకొడుకొక్కడుండె. కాసె దిగినోడు. ఇగ వాడయితేగా కూసు మింతున్నడు. అమీను పొద్దునొచ్చే, పొద్దు మీకొచ్చె. పొద్దుమీకొచ్చె యింటి యింటి కెక్కడని సమ్మందం. అప్పుడు వూరంత వొక పట్టుండబట్టికె మమ్ము దాసిన్రు. లేకుంటె యిప్పటోలుంట యేడ బోదుం. మేం మంది సొమ్ము దిన్లే మాదే నాశడం జేసిన్రు, నీ బాంచనయితే కాల్మొక్కుత. మమ్ముల గింత నాశ డం జేసిన్రు. గింత పావం అయింది. నా కొడుక్కయితే గోర్లల్ల సూదుల్తోటి పొడిసిన్రు. సిలుకొక్కయ్య కేసిన్రు. జుట్టువట్టి నా పెనిమిటి కయితే సెయ్యిబడి పోయింది. కొడితె, ఓ.... అరవై మగ్గాలు పోయినయి. ఇదేందొ సెవులకు పోగులు, రెండు సెవులకు పోగులు పావులెత్తు, పావులెత్తు పోగులు. అదేందొ సెవులకు అయికమ్మలు, దండెగడాలు, ఝుంజేటి కడెం, పోంచి, పెండ్లయిందదివరకు నా కొడుకు చిన్న కొడుకు పెళ్లెబెట్టి యెత్తుకున్నడు. ఇగ యెవని కెరుకయిట్ల వోతున్నమని యెవని కెరుకబడ్డా అన్ని అండ్లనే బెట్టినం అది స్టేషను కచ్చిర్ల పట్నంల వొడ్డెపల్లి దొరది అండ్లనే బెట్టుకున్నం. ఒక్క సొమ్ము వోయిందా అయ్య. అక్కడి సొమ్ము పోయింది, యింట్ల సొమ్ము పోయింది. అంత నాశడం

జేసిన్రు. అప్పుణ్నా కొడుకు రెండు కోడెల అడ్డికి పావుశేరు. ఒక్కొక్క కోడె వెయ్యి రూపాయిలు. కోడె అడ్డికి పావుశేరమ్మినం. బర్లో తీరుపోయినయి. ఆవులో తెర్లయినయి అరవై డెబ్బై గొర్రెలుండె పెద్దవొడ్డోల్లెయి తరుముకపోయిన్రు. అయ్యో యిక బతకనే. ఇగ అవికూడ పోతయి. నాయనా కొట్టుకపో నీ మంద లకు కొట్టకపో ఇండ్లు గట్నప్పుడు 500 రూపాయల బాకున్నం. ఏడికాడికే కొట్కపో. కొట్కపో అవిగూడ పోతయి. బర్లు పోయినయి. అవులు పోయినయి. అగమాగం అయ్యో దండి నా కుడుకులు నెలకు మూడొంతు లొత్తన్నయి. నాకులేదు నా నడిపి కొడుక్కి లేదు. నా పెనిమిటికి లేదు. ఇంత కష్టపడ్డ, యింత నిష్టురపడ్డ యింతజేత్తె మా అగం దేవునికి సుతి ముట్టింది. మేం మంది సొమ్ము తిన్లేదు. మంది సేతులో సావలేదు. మాకు వాళ్ళకు పొలం కొట్లాట మొదలయింది. మల్లంపల్లి దొరవారిది కౌలుకు దీసుకున్నం కర్ణపాయనది. మా యింటిదిగాదు. మరి కర్ణపాయనది. ఈందిగాదు. ఈవూరాయనదిగాదు. కర్ణ పోల్ల బాయి సేతవట్టుకోని జేసినం కౌలుకు దీసుకుని కొంచెమయిందా అయ్యయ్యో ఈ పనుగడవంత యీ యిండ్లు గట్టిందంత నా చెలికే. ఇదంత అమ్ముకున్నరు. కొడుకు లమ్ముకున్నరు. నా యిద్దరు కొడుకులు పోయిన్రు. నా పెద్ద కొడుకు పోయిండు. చిన్న కొడుకు పోయిండు. వాళ్లొస్తుంటె నా పెద్ద కొడుక్కేం లేకుండె అగమాగం జేసి యేరే పోయిండు. పొయ్యి యిప్పుడు పటాశోక మొచ్చిండు. చిన్న కొడుకు సర్పంచయిండు. అయిపాయె.

ఇగ సంగవంటె గదే సంగం. వాళ్ళు బేదాకుల జెయ్యమని, బేదాకుల జెయ్యొద్దని సంగమోల్లు జెప్పిన్రు. దానిమీద యీ ఫైటు. లక్షింనరసిమ్మారెడ్డా యందే. వకీలు సాబు ఆరుట్ల లక్ష్మింనరసిమ్మారెడ్డి దీని గురించి మాట్లాడెతందు కొచ్చిన్రు. ఆదు తమాష. అంతయు లక్షింనరసిమ్మారెడ్డి, రామిరెడ్డి యీ యేరి యాల అప్పుడు ఆర్గనైజు జేసిన్రు. ఆయనేమొ ముక్య సంగంలో వుండె. కాదు యిప్పుడు పొలం కాశీజెయ్. కౌలుకు జెయ్యొద్దు. ఆయన మల్లారెడ్డి, ఆ మల్లంపల్లి దొరోడు మాకిచ్చిండు. అదివరకే వుంది. అదివరకు నుంచే దీసుకున్నం. అంతకు ముందే దీసుకున్నరు. ఉండే మల్ల ఆగంజేసుకుంట వున్నరు. వాళ్ళ వూనొచ్చే వరకు యెల్లిపోయిన్రు. ఇగ వూనొచ్చి ఇక నాశడం జేసిన్రు. వూనొ చ్చిన్రు. పోలీసులు రాలే గప్పుడు. ఆ గప్పుడు నాశడం జేసిన్రు. ఆ అగమాగం అడివడివి. నాయనా నీ బాంచెను. ఇప్పుడు నా కొడుకుతాన కూడ లేను. నా కొడుకు బిడ్డ యింట్లున్న. నర్సయ్య ఆయన కొడుకు బిడ్డ. ఆ వూళ్ళో అప్పుడు వేరే ఆడవాళ్ళందరు సంగంలో వుండిరి. ఈ వూరివాళ్ళు కూడ వున్నరుగని యిప్పుడెక్కడున్నరు ? యెక్కడోల్లక్కడ దెంకపోయిన్రు.

ఇంత ముందొస్తే నాయింట్లనె బోజనం పెట్టేది. నాదేవెట్టిన యెవ్వారు వెట్టలే, నా యింట్లనె నాలుగు నెల్లున్నరు. నాలుగునెల్లు కాపాడిస్రు. వాళ్ళేమో జెల్లల్లుంటే వీళ్ళేమో యిల్లు గాపాడిస్రు కాపాడ్తె ఆ వాళ్లొచ్చి యేంపంజేసిస్రు. అదే పనిజేసిస్రు. యూనియ నొచ్చిందంటె బాగానే వుంటది. ఆ వీళ్ళ బయా నికేం జెయ్యలే. ఇరవై మోటర్లొచ్చినయి. జంగి మోటర్లు, ఓ గప్పుడు పెట్టి చ్చిస్రు మల్ల 600 రూపాయలు గాడిదె కొడుకు కడుపుకాల అంతెక్కడోల్లక్కడే వున్నరు. యూనియ నొచ్చిం తర్వాత, అంతకు ముందు అంటె అంతకుముందు అందరు మంచిగనే వున్నరు. మేవంటే మేవని నన్నేమంటే నువ్వని, నిన్నే మంటే నన్నని మంచిగ అందరు కూడున్నరు. ఇంకెక్కువైపోయిందని వూరు కున్నరు. పట్నందాక మంత్రి జాడపోయిన నేను వూరంత దిరిగొచ్చిన తిరి గొచ్చి తిరిగొచ్చి సెర్లపెట్టుకున్న సంగపోల్లు దీస్కపోయిస్రు. ఒక్క ఆడోల్లు నేను కమలాదేవి పేచిపేచికి నేను కమలాదేవి బయాన మందిని దీస్క పోయేది. మందిని దీస్కపోతె కమలాదేవి వొస్తే పక్కేసి బట్టలేసి నిలుచుండేది మందొస్తె. రామచంద్రరావు ఆయన జైల్లోనె వుండె. ఒక్క లక్షింనరసిమ్మారెడ్డుండె. అది వరకే వున్నది భూమి. అదేదొ కౌలుకు దీసుకున్నం వుంచుకున్నం. ఇరవై యేండ్ల కొచ్చింది వుంచుకుంటె వాని కోర్వలేక అది గుంజిండు. పట్టావున్న వొల్లనేమొ యెవ్వరేవన్లేదు. మేం గాడ దెచ్చుకుంటె మాది గుంజుకున్నరు. మాకు పట్టెక్కడిది? కౌలుకు జేస్తిమి. ఇయ్యాల మీది వొలవంటె అంతకు ముందు సంగపోల్ల దగ్గర కెల్లలేగదే అది వొచ్చేవరకు మేం వొదిలిపెట్టమంటె మేం గట్లనే పట్టుకునేవరకు మేం వొదిలిపెట్టమన్నరు. సంగం వొదిలిపెట్ట మన్నరు. సంగం అంటే మేం వొదల వన్నం. యూనియన్ రాకముందు కూడ యెవ్వర్రాలె. యూనియన్ రాకముందు ఆడోల్లు మగోల్లు బండ్లు గట్టుకోనొచ్చిస్రు. జనగామలో పెట్టినప్పుడు వొచ్చిస్రు ఆడోల్లు మగోల్లు బండ్లు గట్టుకొనొచ్చిస్రు. అది తిరమ్రెడ్డి కోయేస మేసుకోనొచ్చిండు. కోయేష మేసుకోనొస్తే వాని కడుపుకాల పట్టుకున్నరు. తిరుమ్రెడ్డి నాన్నె జనగామలో పట్టుకున్నరు. కంచెకాడ జంపిస్రు. మూడు బజార్లకాడ జంపిస్రు. ఇల్లు తగులబెట్టి, జొన్న లెత్తుకపోయిస్రు. ఇవన్ని జేస్తాంటె యీ పోరాట మెందుకనెట్లనిపిస్తది. సేతులున్నదాయె. సేతులనుండెట్లిడిసిపెడతం. వాళ్లే గుంజుకుస్రి అన్ని యెక్కడియక్కడ. యేంజేసినం. గుంజుకున్నరు మల్ల నా పెనిమిటి గట్లొచ్చినంక నా చెలుకలు నాకొచ్చినయి. నా వొలం నాకే వొచ్చింది. కొట్లాటయితె మాత్రం వొలమంతరాలె. అమ్ముకున్నరు మంది. మల్లంటి దొర వారు అమ్ముకున్నరు. అయనమ్ముకుంటె అంత బోదవోసి దొరలేడు దొర సానె. అంత బోదవోసి లంచాలువోసి యీ వూర్లెవొక దూదేకులోడున్నడు.

తెనుగోడు. కొజ్జోడనున్నడు. అంతమ్ముకున్నడు. అమ్ముకుంటె మాకో గొర్లాయన, వొక కాపాయన, తెనుగోడు అదె వాళ్లయిదుగురు మొగోల్లు అయిదుగురు కొడుకులు వాడేం జేసుకోని బతుకుతార్రా. పొలాలన్ని గుంజుకరా అంటె పొట్టోడు అన్నడుగదా అడివిన తంపుల అడుక్కుతినేటోనికన్నడు. అంటె అడుక్కుతింటె అయిదుగురు మనుషులు ఏడడుక్కుతింటే ఏమయితదిరా. ఏమొస్తదిరా. ఏన్నుంచొస్తదిరా. వొద్దంటె ఆఖరుకి గొల్లాయన్నుండి రెండున్నరెకరాలు దీసుకున్నడు. పైకంగట్టి దీసుకున్నడు. అయ్యోనాయనా. ఇగ అంత కష్టపడ్డం. ఇగ గదే నిలిసింది. ఇగ సెరుకల్నిలిసినయి. పొలం నిలిసింది. ఇగన్ని పోయినయి. ఒక్కటని యాదికుంటదామ్మా. ఎంత అగం బెట్టిచ్చిన్రు. సంగంవాల్లు యిప్పటి కొస్తనేవున్నరు. వచ్చిపోతనే వున్నరు. ఎకరాల కెకరాలు వాగుల కలిసినయి. అమ్ముకున్నరు. అంతవోయి రెండెకరాలొచ్చింది.

నా కొడుకు లయిదుగురు, వొక్క బిడ్డ. బిడ్డను దామన్నపేట కిచ్చిన. ఇద్దరు కొడుకులు సచ్చిన్రు. ఈ పోరాటంలో వొకడు సచ్చిండు. చిన్నోడు సచ్చిండు. వాళ్లుండేదుంటె నా యీవూసే దగ్గకపోవు. నా పెనిమిటి కూడ సచ్చిపోయిండు. అ దెబ్బలకే అప్పుడే సచ్చిండు. ఆ దెబ్బలకే నష్టపడ్డరు.

సంగమంటె దేశం దేశం పొంటున్నది. మేం వొదలమన్నం. గదే వొదలాలంటె వొదలాలన్నరు. గదే గింత పంజేసిన్రు. సంగంలకు అడోల్లు పోతరు, మగోల్లు పోతరు, అందరు పోతరు. మాయింట్ల యెవ్వరడ్డుపెట్టక పోతున్రి. అందరం పోయెటోల్లమె ఏమడ్డులేదు. పొలాలల్ల పంజేసుకునేది. వృత్తి పనిమీద అంతిష్టంలేదు. జీతగాండ్లులేదు. కొడుకుల్లేరు, కోడండ్లులేరు, బిడ్డల్లేరు, పొలంపని జేసుకునేది యవసాయం జేసేది. అన్నిటికి తిరిగేది బాగనే తిరిగేది బాగానే జేసేది. గిప్పుడు రోగాలకింద పడ్డ. చాతగా కుంటయ్యింది. గిప్పుడు నడుస్తుంటె కాళ్ళులేవు, కండ్లు కానొస్తలేవుగద. మందిచ్చిన్రు. డాక్టరొచ్చి మొన్న యింజిక్షిన్లు. పట్నం దీస్కపోయిన్రు.

సంగంలో యేం పనున్నది. వాళ్ళకు జేసినా, పెట్టినా, చేపినా ఇక నాకేం పనున్నది అన్నం వండి పెట్టడం. ఎప్పటికి పెట్టిన. వచ్చినోల్లందరికిమా అమ్మ నేనే పెట్టేది. సంగవని సంగపోల్లని పెట్టిన.

ఆ నీకు పెడత. అందరికి పెడత. అ ప్రేముండే పెట్టిన. భూమికోసం కొట్లాడిన్రని పెట్టలే. భూమికోసం కొట్లాడితెమాత్రం భూమున్నదా? జైల్లోగూడ పెట్టిన్రు. చంచల్‌గుడ జైల్లో వెట్టిన్రు. యాడాదుంచిన్రు జనగామలో అర్నెల్లుం

చ్రిను. ఖమ్మంల ఆర్నెల్లుంచ్రిను. ఒక్క దిక్కుంచినారు? ఆఖరికి నా కొడుకు నేంజేసిగ్రను. గుడివాడ దిక్కు. గుడివాడ దిక్కు నా మొగున్నేసిగ్రను. ఒక్క దిక్కుంచినారు వాళ్ల కడుపుగాల. ఓ ఆగం. వొక్కాగమా. ఆకరికి మల్ల నల్గొండ కేసిగ్రను. నన్నెవడు దీస్కపోతడు జైల్లకు. నన్నెవడు దీస్కపోలె. దొరకలే నేను. దొరకలె. ఇక్కన్నే మార్గానికున్న. నల్గొండాయ నేమన్నడు గద. ఈ వూరి పిల్లను జేసుకున్నరుగదాన్నడు. మల్ల నేను కచ్చేరికి పోయిన నల్గొండల. అగమాగం. నేనాడంగ గానొస్తె యెవరో యేర్పాటు చేసుంగ్రి. వొచ్చిండు. నాయనా నీబాంచనయితె. యేంగొట్టుకున్నరు. నల్గొండకాడ మంది. సగజెప్పేవరకు పోలీసులెగబడిగ్రను. కొట్టుకున్నరు. ఇడిపిచ్చిగ్రను. ఆ కష్టం రాకూడదనుకుంట నేను. ఆ కష్టం యెట్ల సముదాయిచ్చినో ఎట్ల బోయినో నేను నాకేరుకలే. ఎప్పటికి దాక్కున్న. వాని యినుమునోని కంట్ల పడ్డనా నేను? పళ్లే. ఎవ్వడు. బాబుగోని కడుపుకాల పెద్దగుగ్ర మెక్కొచ్చె. చెట్టుకు కట్టేసి సంపె. ఒగన్ని చెరువుకట్టకు సంపె. ఇద్దరు ముగ్గుర్ని. అదేందొ. అటొత్తాంటె యిద్దరన్నదమ్ముల అదెందొ అండ్లేసి కందిపుల్లల్లేసి కాలబెట్టిరి. వాని కడుపుకాల. జనగామల దొరికిచ్చుకున్నరు. జనగామల సాకలోడు దొరికిచ్చు కున్నడు. అన్నే సంపిగ్రను. నేనప్పుళ్లేనక్కడ. అక్కడ సంపిగ్రను.

నేను బయట పోయినప్పుడు నా పోరగాల్లు జూసుకునేది. సిన్నోళ్లుగద. ఇంతోడువాడు. అంతోడువాడు. నా బిడ్డున్నది, నా కోడలున్నది. ఓ కోడలు అవ్వగారింట్లనె వున్నది. మరి వాల్లు బయపడకపోదురు. బయపడేది హన్మకొండ పోలీసాయనుండి అమీను అబ్బబ్బ. ఎంత దోకా దిన్నవు.

పెండ్లయినయి రెండుబట్టలుండంగ సంచిల బెట్టుకోని మార్గంగ నీది యేవూరంటె పలాన వూరని జెప్పకు. అక్కడ జెప్పకు. దూరం యే వూరన్న జెప్పుగాని మనవూరు జెప్పకని ఆ యాదగిగ్రావుతోని అనిపిచ్చిగ్రను. రెండు సీర లిచ్చి పంపిండు. పోలీసాయన గూడ కొంచెం సాయమిచ్చిండు. కొంతమంది సాయమయిగ్రను. మోటర్లు 25 మోటర్లొచ్చిన్నాడు నా పిల్లలందరు తమ్మునింటి కాన్నే వున్నరు. ఈ పోలీసాయన, పిల్లలు అందరు అండ్లనె వొక్కదగ్గరే వున్నరు. అందరొక్క తీరుగనే వుంటరా? ఇగ యిప్పుడి కిప్పుడు యెనికొక్కయ లోతె వున్నట్టుంటె అందరు సత్తురు. కొడవండ్లెత్తుకపోయేదమ్మ. గొడ్డల్లు ఎత్తుక పోయేది. కత్తులెత్తుకపోయేది మాపనోల్లయి. రెండు దీపాలు, రెండు కందీల్లు. ఆ యింట్లోటి యీ యింట్లోటి. అవ్వి యెత్తకపోయిగ్రను. తలె చెంబు యెత్తక పోయిగ్రను. బిందెలెత్తుకపోయిగ్రను. ఆకరికి మీదవెట్టిపోతె ఆకరికి యిల్లిడిసిపెట్టి

పోయినం. అక్కడ తూర్పు పోయినం బెజవాడ. యెక్కడ సంగపోల్లుంటె అక్కడ పొయిన. పోతె వాల్ల కడుపు సల్లగుండ బయంలేదు ఏంలేదు. ఆ నారాయణుడె తీసకపోయిండు. బగమంతునిమీద బారమేసుకుని పోయిన. ఒక్కదాన్నే పోయిన. జనగామ నుంచయితె వొక్కదాన్నె వొచ్చేది నడుసుకుంట. నడిసి నడిసి వొకనాడు పట్నంనుంచొస్తాంటె రగునాద్పల్లికాడ కాల్జారింది. జోలెడంత రాత్రయింది. రాత్రిపూటొస్తాంటె కాల్జారింది. సేతిల మూటున్నది. రగునాద్పల్లికాడ అడ నిలబడివున్న. అరె, సచ్చె సచ్చె. అందుకున్నడు నాయన అందుకున్నడు. బాగ అమురుకున్నరు. పోలీసులమురుకున్నరు. నిజంగ యిగ నా పాణం వొణుకుతందిగద. నా పిల్లల్ని జూడకుండ పోదుగదా. నా తంత్రీ, యెవరన్న అడ్డమొచ్చిన్రు అనుకోని తీస్కపోయి అమీనున్నకాడ పెండ్లమున్నరు బిడ్డలున్నరు. అమ్మ వచ్చినావె అని మావూర్లె చనా రోజులుండిపోయిన్రు. మంచం వేసి జంపకానేసి పండమంటె నిద్రపడతాది. ఎటూ పట్టది. ఎక్కన్నో పోయినగద. అంగ్ల పడిపోయినగద అనుకున్న. తెల్లారంక లేచినంక యిగ చిన్నంగ పో అమ్మ. ఇగ ఆడ బయలెల్లి యింతవరదాకొచ్చిన. ఎట్ల వొచ్చినో్న. ఎట్లవోయినో్న. ఒక్కపూట అయిదు పూటలు ఆరు పూటలు తినకపోయేది. తిన్నట్టుండేది. తిన్నట్లే తగినట్టే. యెవరన్న పెడతమన్న తినబుద్ధిగాకపోయేదమ్మ. కొడుకులున్నా యేది బాగనే సచ్చిన్రు, ఆడొకరు యీడొకరు యేం జూస్తరేమిస్తరు. మనవరాలియ్యాలె కొడుకు బిడ్డ. వుంటే యిచ్చిరి ఇయ్యాల ఆపతొచ్చినా సంపదొచ్చినా సూడరా. కట్టం వస్తే సూడరా. ఏంది సూసేది, మొన్నవాడు నేనాయపాయెనంటె అ సారు కడుపు సల్లగుండ సూదేసిండు. మొన్నటిదాక నొప్పిలేసింది. యెన్నుపట్టెలన్ని గుంజుతయి. ఇయన్ని గుంజుతాయి.

నా పేరుమీద బూమియ్యలె. అంత పంచుకున్నారు. ఇయ్యలే వాల్ల కడుపుకాల. ఇయ్యలే ఏమొత్తయని. నాలుగు బత్తాల వొడ్లిత్తన్నారు. నాకు నాలుగు బస్తాలిస్తె యేం బతుకుతం. బట్టిండ్లనె. రైకిండ్లనె, చుట్టంబువ్వయిండ్లనె. దీపం సమురు, తల సమురు, తినబుద్దయితే కూరిండ్లనె, నారిండ్లనె. ఏమయితది ? అయిపాయె ఈ యిత్తె వాళ్లకడుపు సల్లగుండ, వాల్లింట్లది బెడతాన్రు. మరి వాల్లింట్లది పెట్టకుంటె వీలయితాదమ్మ, ఐల్రెడ్డి ఫోటో దింపిచ్చుకున్నాడు. పైకం వత్తదన్నడు. మొన్న అక్కన్నె లక్ష్మినరసిమ్మరెడ్డి సస్తె దినాలకు బోయిన పెంబర్తికి, అన్నె దీయించుకున్న, అందరొచ్చిన్రు కమలాదేవి వాల్లంతొచ్చిన్రు, రాంచంద్రారెడ్డి, రామారెడ్డి, చంద్రయ్య అందరొచ్చిన్రు, ఎక్కడెక్కడోల్లో, ఫోటో తీయించుకున్నారు. ఏంచేత్తవమ్మా, నీకు పైకమొచ్చేది. పైసలొస్తయ్యని సెప్పిన్రు.

జైల్లల్ల నేనులేను. నా పెనిమిటి లేద ? ఆయన పేరుమీద రావాలె, నా పేరుమీద రావాలె. ఏదిదంత జేసిన్రు, సేత్తె యేది ? నాకు రాలే, నా పెనిమిటికి రాలె. వొంటిమీది సొమ్ము వాయే, దెబ్బల్లోని సచ్చిండు, సంగంతోని మా సొమ్ము తిన్నరుగని మేం యెవరి సొమ్ము దిన్లె.

నేను బయట పోయినప్పుడు నా బిడ్డ, నా కోడలింట్లనె వుండేది. యెవ్వరు బాద పెట్టలే. యెందుకు పెడతరు ? వాల్లదగ్గరి కెందుకొస్తరు. వాల్ల కడుపు కాల, అన్ని దోస్కపోయిరి, మల్లెందుకొస్తరు, యేమున్నదనొస్తరు, సేసిరి, మల్లయింక యిల్లిడిసిపెట్టి పోతిమి. జైల్లలనుంచొచ్చినంక యేవున్నది. గాజులు పగిలిపోయె, కుండలు పగిలిపోయె, అడుక్కతిన్న వొండుకు తినేందుకు కుండ లేదాయె, తాగెతందుకు చెంబు, తలె లేదాయె, ఎల్లిపోయి అక్కడుండొచ్చిన్రు. ఎల్లిపోయినకాడ మా తల్లిగారున్నారు. అన్నలున్రి. మా గింజలు, గొడ్డు గోద వుంటె అక్కడికి పంపిచ్చిన్రు. వాల్లకేసి మొక్కాలె. పోయొచ్చినంగని యెక్కడేం లేదని మల్ల దీస్కొచ్చిన్రు, తీస్కొస్తె అంతయిపొందని మల్లేంలేదు బాగనే వుండొచ్చని మల్లొచ్చిన్రు.

అదేందొ కాల్లకాల్ల దిరిగి దొర గొంగడి కొనిచ్చిండు, ఆ గొంగడేసుకుని కల్లంకల్లం దిరుక్కుంట యిన్ని గింజలడుక్కొచ్చేది నా పెనిమిటి, అవి దిను కుంట వున్నం, వూరు మా పాలోల్లుతిక్రిను, వచ్చినంక మా పాలోల్లు యిడిసి పెట్టిన్రు, ఆ వూరుంచుకున్నం, ఆ వూర్లడుక్కొచ్చుకున్నాం. ఆ గింజలడు క్కస్నం. పుట్టెడొడ్లగాబుండె, సంపాయిచ్చుకున్నం. నా కత గట్లయింది, ఒక్క టని యాది కుంటదా ? పెండిల్లు గూడ అండ్లనె జేసిన అప్పుడె. అది సంగ మోల్లు రాకముందే అయినయి. ఒక్కడె సిన్న పిల్లగాడు. ఈ భూముల్దరలయి నయి. అనంతపూరు దొరవారు మాకు యీ భూమమ్మిండు. పెరకలు మేమే గొనుకున్నం, ఇగ ఈ పొలంపైకం పట్టుకున్నం, బియ్యమున్నయి ఇగ గంతే సాలనుకున్నం. వాని పెండ్లి జేసినం, వాడు బాయి పట్టిండు. వొరలేసి బాయి. యీ వూరి సర్పంచు నా మనవడే, అంతా సంగంలనె వున్నరు, నా బల్గం, నా బల్గం బల్గవంత.

సంగమంటె పేదోల్లు సమంగుండాలని, ఆ రాజ్యం గావాలని అంతె. అప్పుడు జెప్పిన్రు, ఇప్పుడు తిన్నోల్లె తింటాన్రు. పేదోని కిత్తాంద, వాని కడుపు గాల, వాడే తింటాండు, పేదోల్ల కొస్తాంద మరిప్పుడు, పోరాటం జేసినం, సేస్తె మాత్రం, పోరాటం జేసి నోల్లున్నరా ? పోయిరి. సేసినోల్లు సచ్చిరి.

సంగపోల్లు పోరాటం అపుజెయ్యకుంటెనే గింత ఆగం జేసిన్రమ్మ, ఇది యిడిసిపెట్టున్రి అన్నరు, వాల్లు సెంచల్గుడ జైల్లుకు పోయి ఆడికి దీస్క

పోయిన్రు. మాల్పటేలు మీ వూర్ను వదిలిపెట్టున్రంటె మేం వొదిలి పెట్టమని వాల్లన్నరు. మేం సచ్చిన మంచిదెగని మేం వొదిలిపెట్టమన్నరు. అన్నంక ఇగ యెట్లొదిలి పెడతరు. సంగపోల్ల దళాలు ఆయుదాల్తొ పోరాటం చేసెటోల్లు. ఆ తర్వాత యెందుకు సెప్పిన్రో ఆపినమని, అవన్ని యాదికి లేదు.

మొత్తం వాల్లొస్తనె సంపి సంపి యిడిసిపెట్టె. బుడ్డగోసులు పెట్టుకోని పోయిరి. బుడ్డగోసులు పెట్టుకోని పోతె నా యింట్లయి దోతులు సంపిసై పెట్టుకోని పోయిన్రు. బట్టల్లేకవ్వా బట్టల్లేక, అన్ని గుంజుకున్న రవ్వా, అన్ని కాల బెట్టిన్రు. అన్ని నాశడం సేసిన్రు. బండ్లే గాల పెట్టిరి, అన్ని జేసిరి యింకే వున్నది. లోపల యింతింతెల్పు దెబ్బలు. యింతింతెడల్పు నెత్తుర్లు గారినయి. వాల్ల కడుపుగాల నేం దెబ్బవల్లే. యెప్పుడు దొరకలే, ఇయ్యాల యీ పక్కింటి కాడున్నదని వాల్లొత్తాన్రంటె యింట్లున్నగాని యెవ్వరికి సెప్పలె. యిప్పుడు యీ దినమయ్యుంట సెప్పుదురు. పొతే అదేపాయె, మంచిగుందురు. ఆడామగ అందరున్ని సంగంల్లనె, కమ్మరాయనది గాల బెట్టిన్రు, యిద్దరన్నదమ్ములను సంపిన్రు, ఒక కోమటాయన్ను సంపిన్రు. కుమ్మరోల్ల పిల్లగాడు, గొల్లోల పిల్లగాడు వడుసోల్లె గొర్లం దోల్తాంటె సంపిన్రు, సెట్టుగట్టేసి సంపిన్రు, వాల్ల కడుపుగాల, ఆడోల్లని ఆగం సెసిన్రు గని నేనింట్లోలేను, చాన జరిగినయి, ఏం జేసిన్రు సంగమోల్లు, వుసునూరు పట్కపోతాంటె పోనియ్యలె ఆడోల్లని యీ వూరోల్లందరు గలసి, దండుగ లందరితాన, వాని కడుపుగాల, దండుగ లీసుకున్నారు. దండగల్లటిచ్చుకునేటోడు, ఎంత మందినయితే అంతమందిని రెక్కలు బట్టుకొని దీస్కపోయిన్రు, గుంజకపోతనేవున్రి, మొగోల్లనయితే కొట్టి కొట్టి సంపిన్రు, ఆడోల్లనయితే యేం జేయ్యలె.

ఆడోల్ల, మొగోల్ల గడీలకి దీస్కపోతాంటె మేం సచ్చిన మంచిదెగని మీరాడోల్లని పోనయ్యమన్నరు. పోనిత్తరా, యిప్పుడయితె సంపుదురు. అప్పుడంతా యేకమయ్యి వుంటం సేత సాగింది. యిప్పుడయితె నువు సత్తేంది. నాకేంది అన్నట్టుంటరు. ఆ యిప్పుడట్లున్నరు, నేం సత్తె నీకు తిందామనుండె గట్ల, యిప్పటి రోజులు మరీ అన్యాయం, అప్పుడు సంగతివుంటె యేంది. వస్తరు, సూసుకుంట పోతరు, వొచ్చినోల్ల కింత పెతతరు, తింటరు, అప్పుడు బయముండేద. ఇప్పుడెక్కడిది? యిప్పటి సంగాని కప్పటి సంగానికి చాన తేడా వుంది. అగొ యిచ్చంత్రం, యిచ్చంత్రం. సిత్రం జెప్తరు. జెప్తరుగని నాకు సెప్పొత్తదా, అనొత్తదా, అనరాదు. లేనిమాట లెందుకు జెప్పలె, వున్నది జెప్తాందుకె రాదు.

భూమి నా కొడుకులు పంచుకున్నారు. వాల్లమీద మన్నుపొయ్య, నా

పెనిమిటి సచ్చటం పరచుకున్నారు. నా పెనిమిటి వుండంగ అరెకరం పోలం వుండె, వాల్లు నా పెనిమిటుండంగనే యెగబడ్డరు, రెండెకరాల సెల్క, అరెకరం పోలం వుంచుకున్నం, యిద్దరు సిన్నోల్లు నాతో నుండ్రి. ఆయన సావంగనే తీసేసిండ్రు, అదిగూడ తీసేసిండ్రు. వాల్ల కడుపు సల్లగుండ తింటాండ్రు.

పెరుగుతాంది యిటు గూడ పట్నం పెరుగుతాంది. ఈ దేశమంత యియన్ని సెల్కలె. ఒక్కగుడే అడ్డం. యివ్వన్నవే, ఇదో కొడుకుది, అదో కోడుకుది, వాన్దోటి నచ్చిన కొడుకుల్ది. యింక కడతాండ్రిల్లు అగో.

సంగపోల్లు వస్తే వాల్లేం వొండుకునేది? నేనేం బెట్టేది. మొగోల్లయిరి. మేం వొండుకునేవి. వొండుకోండ్రంటె వొండుకొనేది. గిన్నెలుండె, బిందెలుండె. వొండుకొండ్రి నాయనా అంటె వొండుకొనేది తోటల్ల నుంచి కాయగూర్లోచ్చేది, పూల్లోవాల్లు కాయగూరలు పంపేది. చారుట్ల నుంచోచ్చేది. సీతారాంపురం నుంచొచ్చేవి. గింజల్రాలేదుగని కాయగూరల్పంపేది. నా యింట్లయే రెండు గొర్లు పాలిచ్చేవి. రెండావులిచ్చేవి. వాల్లిష్టం తాగినరు, తిన్నరు. అప్పుడు గది సేసిన సేతనె గిప్పుడు, నాకు పాట పాడొచ్చిందా; నాకేం సెప్పిన మాటోత్తదా? గయిపడ్డది, నేను కష్టపడ్డది, సెప్తావుంటె పోతనే వుంటది.

అప్పుడు పాడమన్నరుగని యిప్పుడేం లేదు. నా పెనిమిటి నా దగ్గరున్నాడా, నా పెనిమిటి యెప్పుడు జైల్లల్లనె దిరుగుతాండె, ఇగ నా కొడుకులు, నా పెనిమిటి జైల్లల్లనె దిరుగుతాండ్రి, ఎవలకు సెప్పక పోయేది. నాకే చెప్పేది. ఖమ్మం జైలుకు కొన్నాల్లు బోయేది. జనగాం జైలుకు కొన్నాలు పోయిరి, సెంచల్గుడ జైలుకు యేడాది పోయిరి. మల్ల గుల్బర్గాకు వొకన్ని తీస్కపోయేది. మల్లోచ్చినంక నల్గొండ జైలుకు తీస్కపోయేది, యేడుంటాండ్రు, అల్లు, నేనొక్కదాన్నే.

ఎమని సెప్పేది వాల్ల నోట్ల మన్నుపొయ్య, ఎవరు బయానికి పాడక పోయేది. యిసునూరు బయానికి పాడకపోయేది. నన్ను బాలనాగమ్మన్నరు. పాటపాడిండ్రు, వుయ్యాల పదం పాడిండ్రు, ఇసునూరు రామచంద్రారెడ్డి, మాల పక్కీరోల్లు పాట పాడిండ్రు, ఎవర్న ఎడ్డనిచ్చి దేశం దేశం పంటి పాడిండ్రు, సేల్ల పంటి కావలాకాసినం, మొగోల్లు, అక్కడ మొగోల్లె పెట్టేది.

సమావేశాలల్ల ఆట, వేసాలేసిండ్రు, సేసిండ్రు, నాటకాలేసిండ్రు, ఏజ్జేసిన యిదె అగడం, సంగం, రాజ్జెం వస్తుందనే ఆశ వుండ కేద బొద్ధి, వాల్లొచ్చి వొక్క మాటంటె సాలు.

(తన జీవితం గురించి ఐలమ్మ చెప్పిన కథనం–స్త్రీ శక్తి సంఘటన సౌజన్యంలో)




వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ

నీతో సమానమైనదివేమిటి ?
కళ్ళు మూసి చూస్తే
నువు గడ్డకట్టిన హిమ సముద్రానివి
కళ్ళు తెరిచి చూస్తే
నువు అనంత నీలాకాశానివి

గుండెలోతుల్లో
రాత్రుల చీకట్లలో
మంచు శిరస్త్రాణపు పర్వతం నిలుస్తుంది
ఉదయాల వెలుగులో
నదుల బంగారు లోగిళ్ళలోకి పరుగిడుతుంటాయి

నీతో సమానమైనది
నీతో పోల్చగలిగినదేదైనా ఉందా ?

వాన చుక్కలు నిండిన కారునల్లని మేఘంలాగ
నువు నా నిద్రమీద కమ్ముకుంటావు
దినమంతా నేను పూర్తిగా మేల్కొని ఉన్న వేళ
నువు నా మాతృభూమి సాధారణ నేలవవుతావు

(ఫోటోలో ఉన్న కవిత)

# సాహితీ నివాళి

మృత్యువూ, ఓపిక వహించడం నేర్చుకో
మనం సిద్ధపడదాం
నీ శీతల కరస్పర్శ
భయానక కథనం కాదని మనం గుర్తిద్దాం
అప్పుడిక
నిన్నే అగ్రభాగాన నిలిపి
మేం గమ్యంలేని మా యాత్ర మొదలెడతాం
'జాను' మృత్యువు గెలిచింది
ఐతే మేమూ ఓడినట్టు కాదు'
అని మమ్మల్ని ప్రేమించే వాళ్ళకు
మేం చెప్పనీ

ఏప్రిల్ 24 న ఈ కవితా పాదాలు రాసిన బీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ జులై 11 న మరణించాడు.

తూర్పు బెంగాల్ (ఇప్పటి బంగ్లాదేశ్) లో ఢాకా జిల్లా బెజ్‌గాఁవ్ గ్రామంలో 1920 లో జన్మించిన బీరేన్ 1940 నుంచీ కవిత్వం రాయడం ప్రారంభించాడు. ఆయన సాహిత్య కృషి ఐదు దశాబ్దాల సుదీర్ఘ కాలంలో సుసంపన్నమైన కవితా వైవిధ్యంతో సాగింది. బీరేన్ 1940 దశకంలో ప్రముఖులైన విప్లవ కవులలో ఒకరు కాదు. కాని ఆ ఆశ నిరాశలు నిండిన ఆ సంక్షోభ దశాబ్దంలో ఆయన కూడ ఇతరుల లాగనే రాజకీయ కవిత్వం రాశాడు.

'ముప్పై ఆరువేల పాదాల కవిత రాసే బదులు
నేను భూమిని అర్థం చేసుకుని ఉంటే!' అంటూ ఆయన తన సహజమైన అనిశ్చిత స్వరాన్ని పలికించాడు. ఆయన సమకాలికులైన ఇతరులందరూ కవిత్వం రాయడం మానేసినా, ఆయన కవిత్వం రాయడం కొనసాగించేలా ప్రేరేపించినది బహుశా ఈ భూమిని అర్థం చేసుకోవాలనే వాంఛే అయి ఉంటుంది. తన కవిత్వమే తనకు బతుకు తెరువు కాకుండా చూసుకోవ

...

దంలో బీరేన్ అతి జాగ్రత్త వహించాడు. పడుతూ లేస్తూ నడుస్తున్న చిన్న పత్రికల కెన్నిటికో, పారితోషికాలేమీ చెల్లించలేని పత్రికలకెన్నిటికో ఆయన ధారాళంగా కవితలు అందించాడు. ఈ కాలంలో జీవిక కోసం అనువాద కృషి చేపట్టాడు.

"మనకు, మొదటి శ్రేణికి చెందని రచయితలమైన మనకు కూడ ఒక బాధ్యత ఉంది. కుళ్ళు మురికి లేని ఒక మానవ సమాజాన్ని మనం కలగనాలి. మన కళా సాహిత్యాలను ఆ భయానక అంధకారానికీ, అభివృద్ధి నిరోధక శక్తికీ వ్యతిరేకంగా ఉపయోగించడానికి ప్రయత్నించాలి. మానవత్వం స్వచ్ఛంగా పుష్పించేందుకు తోడ్పడాలి" అంటూ ఆయన ప్రకటించిన ఈ దృఢదీక్షే ఆయన 70 లలో యువతరానికి సన్నిహితమయ్యేలా చేసింది. బహిష్కారానికీ, అణచివేతకూ గురైన యువతరం విషాద అనుభవాలు పొందిన ఆ దశాబ్దంలోనే బెంగాల్ విప్లవ సాంప్రదాయపు గతానికీ వర్తమానానికీ మధ్య అఖాతం దాని చివరి దశకు చేరింది.

గోడమీది రాతను
చెరిపి వేయాలనుకుంటున్నదెవరో తెలుసా
ఎవరో తెలుసా
అధికార పీఠం
పళ్ళు నూరుతూ కళ్ళురుముతూ అది ఆదేశిస్తోంది
"ఇంక ఆగిపొండి -
ఇక నుంచి విప్లవం మా ఉత్తర్వులను బట్టి సాగుతుంది"అని

ఎమర్జెన్సీ రోజుల్లో నిరసన గళం ఎత్తే సాహసం చేసిన అతి కొద్ది మంది కవులలో బీరేన్ ఒకరు.

కళ్ళురిమి చూసినప్పుడు గెలీలియో లొంగిపోయాడు
'భూమి తిరగడం లేదు' అని రాశాడు
ఐనా భూమి తిరుగుతోంది, తిరుగుతూనే ఉంటుంది
ఎందరు కళ్ళురిమి చూసినా సరే.

ఎమర్జెన్సీలోనే ఆయన రాసిన మరో కవిత
నీ ఇష్టం వచ్చింది రాయి
కాని జాగ్రత్త

పాము తోక తొక్కకు
నరభక్షకి నరమాంసం తింటోందనకు
రాయి, రాయి, కవిత్వం సృజించు
కాని
ఈ దురదృష్ట దినాలలో
అచ్చువేయగూడని విషయాలు ప్రకటించమని
నిన్నెవడు కోరాడు?
నీ దేశం ఎమర్జెన్సీని
అనుభవిస్తున్న ఈ కష్ట దినాలలో
అంత పట్టు విడుపులు లేకుండా ఉండకు
నీ ఇష్టం వచ్చింది రాయి
బోదలేర్ మీదనే జీవించు
నజీమ్ హిక్మత్ గురించి కలలు గను
పాబ్లో నెరూడాను అనువదించు
కాని జాగ్రత్త -
నువు నిషిద్ధ స్థలానికి వెళితే,
పొరపాటునయినా సరే
నువు చూడగూడని నెత్తుటి మరకను చూస్తే,
'నా దేశం ఒక వధ్యశాల' అని నువ్వంటే,
'దేశభక్తి కర్థం వేలాది శిశువుల నెత్తురే'నని నువ్వంటే,
అప్పుడిక
ఈ భూమిమీద
నిన్ను రక్షించగల దేవుడింకా పుట్టలేదు.

ఎమర్జెన్సీ ఎత్తివేయగానే రాజకీయ ఖైదీల విడుదల సమస్య పెద్ద ఎత్తున ముందుకొచ్చినప్పుడు బీరేన్ అలసట లేకుండా రాజకీయ ఖైదీల విడుదల కోసం పని చేశాడు. ఎన్నో కవితలు రాశాడు.

కటకటాల ఇవతలి నుంచి అతని చేతులు స్పృశించాను
అతని చెక్కిళ్ళ లావణ్యం చూసి పరవశించాను
.... .... ....
విలాసాలలో క్రీడా మైదానాలలో సభల్లో ఊరేగింపుల్లో
సంస్మరణ చిహ్నాల నీడల్లో

ఎందరో యువకులు కలిసి ఉండడం నేను చూశాను
కాని
గాలి కూడ తలవంచి
ఏడు సార్లు
లోపలికి వెళ్ళవలసిన
అలీపూర్ న్యాయ స్థానపు
గంభీర విచారణాలయంలో మన కలయికలో లాగ
ఎప్పుడూ
ఇంత గంభీర ప్రేమ రూపంలో
జీవన తన్మయత్వాన్ని
అనుభవించలేదు.

ఐతే బీరేన్ ఖచ్చితమైన అర్థంలో 'నిబద్ధకవి' కాదు. "నేను తొలి రోజుల్లో రాసిన ప్రేమ కవిత్వాలను నేనెప్పుడూ నిరాకరించను. ఇవాళనైనా నా కలం అలాంటి కవితను, ప్రేమ ఉందనో, లేదనో చెప్పే కవితను, సృష్టించే టట్టయితే నేను తప్పకుండా దాన్ని ప్రచురిస్తాను" అని ఆయన 1980 లో రాశాడు.

బహుశా తన దేశమూ, తన ప్రజలూ అనుభవించిన విషాద భరిత చరిత్ర ఎలాంటి రచనలను కోరిందో, బీరేన్ ఆ రచనలనే సృష్టించాడు. తన చుట్టూరా ఉన్న భూమి నాడిని అనుభవించడానికి ఉద్యుక్తుడయిన ఉద్వేగభరిత మానవుడుగా ఆయన బహుశా మరొక రకంగా ఉండగలిగి ఉండేవాడు కాదు.

"ఎమర్జెన్సీలో గొంతెత్తే ధైర్యం మీకెలా వచ్చింది?" అని ఆయనను అడిగినప్పుడు ఆయన తన సహజ ధోరణిలో "ధైర్యమా? ధైర్యమెక్కడిది? నేనూ భయపడ్డాను. కాని ఎవరో ఒకరు ఆ పని చేయవలసి ఉండింది. కనుక...." అని జవాబిచ్చాడు.

ఈ ఐదు దశాబ్దాల కాలంలో బెంగాల్ అనుభవించిన ఒడిదుడుకులను కవిత్వీకరించిన బీరేన్ ప్రాతినిధ్య కవితలు కొన్నిటిని అందిస్తున్నాం.

—సాహితీ మిత్రులు

# సంఘపు ప్రతిష్ఠ

"వృక్షాల మధ్య చీకటి పోలీసుల్ని నేను ఆఘ్రాణిస్తున్నాను"

దేవదారు వృక్షాల పొడుగాటి వరుసల కింద
ఆకాశం ఇక అదృశ్యమై పోతుంది
వాలిపోయిన చంద్రుడు స్వర్గంలోంచి పరుగెడతాడు
రాక్షసులు నాట్యమాడడం మొదలెడతారు
విష సర్పాల శ్వాసలో గాలి మండిపోతుంది-
పాలూ చక్కెర కేళీల గుజ్జు కడుపారా మెక్కి
మన మానవ సమాజం
తన సొంత ప్రతిష్ఠాభద్రతను నెమరేస్తూ
హాయిగా తిరుగాడుతుంది.

# నువు నెత్తురు కార్చినా సరే

నీ నోట్లోంచి రక్తం స్రవిస్తున్నా సరే
రక్తం స్రవిస్తున్నదని చెప్పడం నేరం
అన్ని చోట్లా శత్రువులున్నారు గనుక
వాళ్ళకు మంత్రులు కాపలా కాస్తున్నారు గనుక
నెత్తురు ఉమ్మేయడం నేరం
బాధతో
లాగిన విల్లులాగ వంగిపోవడం నేరం
నీ సొంత గుండెల రక్తంలో
నిశ్చలంగా పడి ఉండడమూ నేరమే.

### వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ కవితలు :

# తెగిపడ్డ దేహాలు అల్లుకుని అరుస్తాయి

"భూమి భూమంతా దేవుని దయ నిండి ఉంది"

మాతృభూమి అని పిలవబడే ఈ వధ్యశిల
అనంతమైన దయను కక్కుతుంది
అప్పుడే పుట్టిన శిశువులకు
తలారులు అనురాగం పంచిపెడతారు : ఆమె లీల–
దేశాన్ని ప్రేమించడం మీద కవులు పద్యాలు రాస్తారు
విఫలమైన రక్త ప్రవాహాలను తీవ్రతరం చేస్తారు
"మర్యాదస్తులారా, మీరెలాంటి ఆటలాడుతున్నారు !"
అని తెగిపడ్డదేహాలు ఒక దాన్నొకటి అల్లుకుని అరుస్తాయి
కార్ల్ మార్క్స్‌నూ లెనిన్‌నూ స్టాలిన్‌నూ గాంధీనీ
పైసా కొక్కరి చొప్పున
ఘనత వహించిన నాయకులు వేలం వేస్తుంటే
భూమి తల్లి బాధతో
లాగి విడిచిన విల్లులా చుట్టుకుపోతుంది

*లోథర్ లుట్జ్‌తో సంభాషణ నుంచి*

ఎల్. ఎల్. : వీరేంద్రా – ఈ ప్రత్యేక కవితను మీరు ఏ పరిస్థితుల్లో, ఏ ప్రత్యేక పరిస్థితుల్లో రాశారో వివరిస్తారా ?

వీరేంద్ర : ఈ ప్రత్యేక కవితను ఏ పరిస్థితుల్లో రాశానో చెప్పేటప్పుడు నేను తప్పని సరిగా గత కొద్ది సంవత్సరాలుగా ఈ దేశంలో నెలకొని ఉన్న భయబీతావహ వాతావరణాన్ని గుర్తు తెచ్చుకోవాలి. బళ్ళకు వెళ్ళే చిన్నారి పాపలతో సహా యువకులందరూ తమ జీవితాలను ఈ వాతావరణంలోనే గడిపారు. వాళ్ళ జీవితాలకు భద్రత ఉండేది కాదు. నిజంగానే వాళ్ళలో కొందరిని పోలీసులు నగర రహదారుల మీద కాల్చి చంపేశారు. ఆ రోజుల్లో నాకు నేను నిజంగా అతి నిస్సహాయ స్థితిలో ఉన్నట్లు భావించాను. దేశం మొత్తం అలాగే

ఉండిందని నా నమ్మకం. అట్లాగే, మేం, దేశపు రాజకీయ నాయకులం, కవులం, సాహిత్యకారులం, తదితరులందరం ఈ భయంకర పరిస్థితిని నిరసిస్తూ గొంతెత్త లేదని కూడ నేను భావించాను. ఒక ముక్కు పచ్చలారని పిల్లవాణ్ణి ఒక పోలీసు వాన్ లోకి తోసి చిత్రహింసలు పెట్టినప్పుడో, వ్యాన్ లోంచి రోడ్డు మీదికి తోసి కాల్చి చంపినప్పుడో మేం నిస్సహాయ ప్రేక్షకులుగా ఉండిపోయాం. ఈ మొత్తం సంఘటనను విధి నిర్ణయంగానో, అనివార్యంగానో గుర్తించి అంగీకరించాం. వ్యక్తిగతంగా నేను అలాంటి సందర్భాలతో మౌనంగా ఉండిపోయాను. కాని వాటిపై ఎన్నో కవితలు రాశాను. ప్రస్తుత కవిత అలాంటి విడుదలల్లో ఒకటే.

ఎల్. ఎల్.: కవిత గురించిన సాంకేతిక అంశం ఒకటి అడగనా? మీరు కవితకు ఒక ప్రవేశిక వాడడం,అదీ ఇంగ్లీషులో వాడడం,నాకు ఆశ్చర్యంగా ఉంది. "భూమి భూమంతా దేవుని దయ నిండి ఉంది" అనే ఆ వాక్యమే మిమ్మల్ని ఈ కవితా రచనకు పురికొల్పిందని అనుకోవచ్చునా?

బీరేంద్ర : కవితకు పైన ఉంచిన ఆ ప్రవేశిక గురించి చెప్పాలంటే, ప్రత్యేకంగా "దయ" అనే మాట నన్ను చాల రెచ్చగొట్టిందనే చెప్పాలి. నా ఉద్దేశ్యంలో నా లోపమేమంటే, ఒక అంశాన్ని నిర్ణయించుకున్నప్పటికీ సరిగ్గా నేనేం రాయబోతున్నానో నాకే తెలియదు. చాల తరచుగా ఏదో ఒక్క మాటే నన్ను రెచ్చగొట్టి, పురికొల్పుతుంది. నేను దాని వెనుకే కొంత వరకు సాగుతాను. ప్రస్తుతం చర్చిస్తున్న కవిత విషయం ఆ కాలపు పోలీసు అత్యాచారాలు. మేం అనుభవిస్తుండిన రాజకీయ, సాంఘిక, తదితర సకల రకాల నిర్వీర్యతలు. సహజంగానే ప్రవేశికగా ఉపయోగించుకున్న వాక్యం నాకీ కవిత రాయడానికి గణనీయంగా సాయపడింది. నేను వరుసగా కొన్ని కవితలు రాయడానికి పురికొల్పిన మరో వాక్యం ఉదాహరణ ఇస్తాను. ఒక రోజు ఆనంద బజార్ పత్రికలో కొన్ని కంప్యూటర్ కవితలలో "వృక్షాల మధ్య చీకటి పోలీసుల్ని నేను ఆఘ్రాణిస్తున్నాను" అనే వాక్యం చూశాను. నా పుస్తకంలోని ఎన్నో కవితలకు ప్రవేశికగా ఈ వాక్యం ఉపయోగపడింది. ప్రస్తుత కవితలో ఈ వాక్యాన్ని ఎందుకు తీసుకున్నానంటే "దేవుని దయ" అంటే అర్థం ఏదన్నా కానివ్వండి, అది నా చుట్టూ మాత్రం ఎక్కడా కనబడడం లేదని చెప్పడానికే.

# అభివృద్ధిక్రమంలో కారంచేడు :
# రెండు అంచుల కత్తి

జులై 17 న కారంచేడు సంఘటన జరిగిన నాటినుండి కారంచేడుపై ఉపన్యాసమివ్వని రాజకీయ నాయకుడు లేడు. రాయని పత్రిక లేదు. మన పత్రికలు కొన్ని సంఘటనలను నిర్లక్ష్యం చేసి నిశ్శబ్దంతో చంప ప్రయత్నిస్తాయి. కుదరకపోతే బోలెడంత పబ్లిసిటీ ఇచ్చి చంపుతాయి. రెండూ కూడ మన జ్ఞానాన్ని కంట్రోల్ చేసేందుకు జరిగే ప్రయత్నాలే. అందులో కూడ రాజకీయ నాయకులకి, పత్రికలకి విచక్షణా జ్ఞానం లేకుండా పోదు. జులై 17 కి "అమాయకంగా, నిరాయుధంగా" ప్రాణాలు కోల్పోయిన దళితులు అక్టోబర్ 6 కి సంఘటితంగా సభ పెట్టుకునే చైతన్యానికి ఎదిగినప్పుడు ఎవరూ గొడవ చెయ్యలేదు. ప్రకటించిన న్యాయ విచారణకు ఇంతవరకు న్యాయమూర్తి లేడు. అరెస్టయినవాళ్ళు ఒక్కొక్కళ్ళు బెయిల్ మీద విడుదలవుతున్నారు. కాని ఈలోగా ఇద్దరు దళిత నాయకులు జాతీయ భద్రతా చట్టంకింద అరెస్టయ్యారు. విజయవాడలో బహిరంగ సభపై భయంకరమైన లాఠీఛార్జి జరిగింది. నెలక్రితం బంద్‌కు పిలుపిచ్చిన కాంగ్రెస్ (ఐ) ఇప్పుడు దళితులు "సంఘ విద్రోహ శక్తుల" నాయకత్వంలో ఉన్నారని లాఠీఛార్జికి వంతపాట పాడుతోంది.

కారంచేడు మీద రేగిన దుమారానికి అనేక రకాల సంజాయిషీలు విన వచ్చాయి. ఓ ఆరుగురి (పోలీసులు గుర్తించకుండా పాతిపెట్టిన వాళ్ళను కూడ లెక్కవేస్తే ఎనిమిది మంది) ప్రాణాలు పోయినందుకనీ, హరిజనులపై అత్యాచారం అనీ, ముఖ్యమంత్రిగారి అల్లుడి స్వగ్రామం అనీ ఏదో ఒక రకంగా ఈ స్పందనని వివరించవచ్చు. కాలక్రమేణా మరిచిపోవచ్చు కూడా. కాని నిజానికి కారంచేడు వంద సంవత్సరాల మన అభివృద్ధిక్రమానికి ఒక ప్రతీక. ఈ సంఘటనపై రేగిన దుమారం మరుగుపరుస్తున్న అభివృద్ధిక్రమాన్ని, దాని స్వభావాన్ని తెలుసుకోకపోతే ఎనిమిది మంది మాదిగల మరణానికి అర్థమూ లేదు. ఈ మారణకాండపై రేగిన నిరసనకు దీర్ఘకాలిక ప్రయోజనమూ లేదు.

మధ్యయుగాలలో కారంచేడు ఒక "అగ్రహారం" అని ప్రతీతి. కాని ప్రస్తుతం అక్కడ బ్రాహ్మణ భూస్వాములెవరూ లేరు. బ్రాహ్మల స్థానంలో కమ్మ భూస్వాములు సరిగ్గా ఎప్పుడిక్కడి భూమిమీద అధికారాన్ని సంపాదిం

చారో మనకు తెలియదు గాని భూమితోపాటే వాళ్ళు బ్రాహ్మణ సంస్కృతినీ స్వీకరించారు. ఈ దేశంలో భూస్వామ్యం పుట్టిన నాటినుండి సమాజాన్ని, ప్రజల్ని నిర్దేశించి, శాసించే బ్రాహ్మణ ధర్మ సూత్రాలను కాలానుగుణమైన సవరణలతో వాళ్ళు గ్రామంలో ఆచరిస్తూ వస్తున్నారు.

1802 లో బ్రిటిష్‌వాళ్ళు శాశ్వత సెటిల్‌మెంట్ పద్ధతిని మద్రాసు ప్రెసిడెన్సీలో ప్రవేశపెట్టినప్పుడు కారంచేడు రైత్వారీ గ్రామం అయింది. ఇక్కడ రెండు మాయలున్నాయి. మొదటిది శాశ్వత సెటిల్‌మెంట్ రెండవది రైత్వారీ పద్ధతి. అంతకు ముందున్న పద్ధతిలో ఒక క్రమం లేకుండా భూమిశిస్తు వసూలు చెయ్యడం వల్ల రెవెన్యూకి, రైతుకు, ఉత్పత్తికి నష్టం జరిగిందనీ, ఇకనుండి భూమిశిస్తు ఒక శాశ్వతమైన రేటు ప్రకారం వసూలు చేస్తామని చెపుతూ శాశ్వత సెటిల్‌మెంట్ వచ్చింది. అలాగే ప్రభుత్వానికి రైతుకి మధ్యవర్తులయిన దోపిడీ జమీందార్లు లేకుండా రైతుతో ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పరచుకొని దోపిడీని తగ్గించే ప్రయత్నమని చెపుతూ రైత్వారీ పద్ధతి వచ్చింది. ఈ రెండూ కారంచేడులో ఎలా నడిచాయో చూడండి. మాయ అదే అర్థమవుతుంది. శాశ్వత సెటిల్‌మెంట్ పద్ధతి శిస్తును పంటనుండి భూమిమీదికి మార్చింది. కరువు కాటకాలతో నిమిత్తం లేకుండా, పంటతో, పంట మొత్తంతో నిమిత్తం లేకుండా శిస్తు చెల్లించక తప్పనిసరి స్థితి ఏర్పడింది. పైగా శిస్తు ధాన్యరూపంలో కాక ధన రూపంలో చెల్లించాలి. ఇది శాశ్వతంగా ఫిక్స్ అయి ఎన్నడూ లేదు. ఏటికి మాటికీ పెరుగుతూనే ఉంది. అందుకే కాలక్రమేణా రైతులందరూ వడ్డీ వ్యాపారస్తులమీద ఆధారపడక తప్పలేదు. దానికితోడు భూమి సరుకు (Commodity) అయి దానికి కూడ మార్కెట్ విలువ వచ్చింది. ఈ రెండు పరిణామాల ఫలితంగా రైతులందరూ తమ భూమిని వడ్డీ వ్యాపారస్తులయిన భూస్వాములకు అమ్ముకోక తప్పలేదు. వాళ్ళ పొలాల్లోనే వాళ్ళు కౌలుదార్లయ్యారు. కొంత మంది వ్యవసాయ కూలీలు కూడ అయ్యారు. 1940 కల్లా వచ్చేసరికి అరడజను మంది వడ్డీ వ్యాపారస్తులయిన భూస్వాముల చేతుల్లోకి 70 శాతం కారంచేడు భూమి వెళ్ళిపోయింది.

ఈ మధ్యకాలంలో వలసవాదులు తీసుకువచ్చిన రెండవ మార్పు సాంకేతికమైంది. నీటి పారుదల, రవాణా సౌకర్యాలు వచ్చి ఉత్పత్తి, ఉత్పాదక శక్తి వ్యాపారీకరణ పెరగడానికి దోహదం చేశాయి. ఈ రకం సాంకేతిక మార్పులు కృష్ణా, గోదావరీ ప్రాంతాలలో (కాటన్ దొర వేయించిన రెండు ఆనకట్టల ఫలితంగా) నూతన పరిణామాలను తీసుకొచ్చాయి. వ్యవసాయ ఉత్పత్తిని

టెక్నాలజీని వర్గ సంబంధాలను కూడ ప్రభావితం చేశాయి. అంతమేరకు లేదు గాని వీటి ప్రభావం కారంచేడుపై కూడా పడింది. కారంచేడులో కృష్ణా కెనాల్ అని పిలువబడే కొమ్మనూరు కెనాల్ ఈ రకంగా వచ్చిన మార్పే. ఈ మార్పులు 1947 తర్వాత ప్రభుత్వ సహాయంలో తీవ్రతరం అయ్యాయి.

1950 ల నాటికి కారంచేడులో మూడు రకాల భూములున్నాయి కొమ్మనూర్ కెనాల్ కింద మాగాణి, వరిపంట ఇతరత్రా మెట్టభూముల్లో పొగాకు పంట. మూడవది నీళ్ళకింద ఉండి సాగుచేయ సాధ్యంకాని భూములు అప్పట్లో పొగాకు పెద్ద లాభదాయకంగా ఉండేది కాదు. అందుకే మొత్తం గ్రామంలో ఎక్కువ భాగం వరిపంటే. 1956 కి 'స్వతంత్ర భారతదేశ ప్రణాళికాభివృద్ధి' ఆరంభమైంది. అదే సమయంలో కారంచేడులో కొంతమంది భూస్వాములు లిఫ్ట్ ఇరిగేషన్ ప్రవేశపెట్టారు. ఈ సరికొత్త సాంకేతిక పరిజ్ఞానంతో మెట్టభూమి మాగాణైంది. అక్కడ పొగాకు స్థానంలో ధాన్యం పంట వచ్చింది. కౌలుదార్లను ఖాళీచేయించి భూస్వాములే స్వయంగా సాగు చేపట్టారు.

1960 ల నాటికి మొత్తం గ్రామానికి డ్రైనేజి వచ్చింది. (ఈ మధ్య కాలంలో నాగార్జునసాగర్ కెనాల్ కూడా వచ్చింది) దాంతో అంతకు ముందు నీటిలోపడి మునిగిన భూమికూడ సాగులోకి వచ్చింది. ఇలా సాగులోకి వచ్చిన భూమిని కొంత భాగం స్వాతంత్ర పోరాట యోధులకి షెడ్యూల్డ్ కులాలకి పంచిపెట్టారు. ఈ 'స్వాతంత్ర పోరాట యోధులలో' జస్టిస్ పార్టీవాళ్ళు ఎంత మందో మనకి తెలియదు కాని దశాబ్దం తిరక్కుండా షెడ్యూల్డ్ కులాల భూమి మాత్రం భూస్వాముల చేతుల్లోకి పోయింది.

ఈ మార్పులన్నిటివల్లా భూమి పోగొట్టుకున్న పాత కౌలుదార్లు ఇతర ప్రాంతాలకోసం అన్వేషణ ఆరంభించారు. వీళ్ళు రెండు దిశలుగా వలస పోయారు. దక్షిణంగా కనిగిరి, ఆత్మకూరు, ఏలేశ్వరం మొదలైన ప్రాంతాల లోనూ ఉత్తరంగా మంథని, మహదేవపూర్, కరీంనగర్, భద్రాచలం ప్రాంతాల లోనూ భూములు కౌలుకి తీసుకొని పొగాకు వేయడం ఆరంభించారు. ఈ లోగా మన రాష్ట్రంలో పొగాకు పంట ప్రాధాన్యం విపరీతంగా పెరిగింది. దక్షిణాన పొగాకు వర్షాధారమైన పంట కాగా ఉత్తరాన కరీంనగర్‌లో నీటిపారుదల సౌకర్యాలమీద ఆధారపడి పెరిగింది. ఫలితంగా ఆ ప్రాంతాలలో భూమి ధర పెరిగింది, చేతులు మారింది. ఈ వలసలో మూడవ భాగం బళ్ళారి, నిజామాబాద్ పోయి పత్తిపంటలు కూడా భాగం తీసుకుంది. కాని వాళ్ల సంఖ్య తక్కువ.

మొత్తంగా వీళ్ళందరూ పెద్ద భూస్వాముల దగ్గర వడ్డీలు తీసుకునే ఇతర ప్రాంతాలలో భూమి సాగు చేసుకున్నారు. క్రమంగా స్వతంత్రులుగా స్థిర పడ్డారు.

పొగాకు ఎక్కడ పండించినా కారంచేడు రైతులు విత్తనాన్ని మాత్రం ఇక్కన్నుండే తీసుకెళ్ళారు. ఇప్పటికి ఈ విత్తనాలు చీరాల చుట్టు ప్రక్కల నర్సరీల నుండే వెళ్తున్నాయి. (ఈ విత్తనాల్ని భద్రాచలంలో యిచ్చి తిరిగి వచ్చేటప్పుడు ఆ అడవుల నుండి టేకు చెట్లను మోసుకొచ్చే వ్యాపారం ఓ పెద్ద సైడ్ బిజినెస్) అంతేగాదు పెరిగిన పొగాకు కూడా కచ్చా గ్రేడింగ్ తర్వాత దూర దూర ప్రాంతాలనుండీ ఇక్కడికీ తీసుకువచ్చి ఫైన్ గ్రేడింగ్ జరుపుతారు. అందుకు కావాల్సిన నైపుణ్యులైన పొగాకు కార్మికులకు గుంటూరు ప్రాంతంలో కొదవ లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే వలస వెళ్ళిన రైతుల 'సామర్థ్యం' వలన వెళ్ళింది గానీ వాళ్ల వలన వెళ్లలేదు. వాళ్ళ యిల్లు, భూములు, ఆస్తి పాస్తులు వలన వెళ్లలేదు.

కారంచేడులోనూ, చుట్టుపక్కల గ్రామాలలోనూ, దూర ప్రాంతాలలో కౌలు ద్వారానూ, ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ కారంచేడు భూస్వాములు, రైతులు కలిసి పది పదిహేను వేల ఎకరాల భూమిని కంట్రోల్ చేస్తున్నారు. వరి పొగాకు ప్రధాన పంటలు. ఈ పంటలమీద వస్తున్న అదనపు విలువ క్రమంగా ఇతర రంగాలలోకి కూడా వెళ్లింది. ధాన్యం మిల్లులు, కాంట్రాక్టులు, రవాణా, సినిమా, వడ్డీ వ్యాపారం, చిట్ ఫండ్ కంపెనీ మొదలైన అనేక చోట్లనుండి ఆదాయం రావడం ఆరంభమైంది. ప్రస్తుతం కారంచేడులో ఈ గృహానికి ఏటా 7 కోట్ల 74 లక్షల రూపాయిల కనీస ఆదాయం ఉందని ఒక అంచనా. ఇది కేవలం సంవత్సరాదాయం మాత్రమే. ఆస్తి పాస్తుల విలువకాదు. ఈ సంపదంతా ఎక్కడికి పోతోంది; భూమి, ఇల్లు ఇళ్ల స్థలాలు, బంగారం వగైరాల్లోకి పోతోంది. కొంత భాగం మళ్ళీ పొగాకు పంటలోకి ప్రవేశిస్తోంది. ఏమైతేనేం పారిశ్రామిక రంగంలోకి మాత్రం వెళ్లడం లేదు.

గత రెండు దశాబ్దాలలో పాత కౌలుదారుల వలసవల్ల అదనంగా భూమి సాగులోకి రావడం వల్ల కారంచేడులోనే పెద్ద భూస్వాములకి కౌలుదార్లు అవసరమయ్యారు. అరకంగా మాదిగలు కౌలుదార్లు అయ్యారు.

కారంచేడులో కౌలు మూడు రకాలు మొదటిరకం ధనరూపంలో గానీ, ధాన్యరూపంలోగానీ నిర్ణీత కౌలు చెల్లించే పద్ధతి. ప్రస్తుత రేటు 14 బస్తాల

ధాన్యం సగభాగం గడ్డి భూస్వామి భూమి మాత్రమే ఇస్తాడు. మిగతాదంతా కౌలు దారే పెట్టుకోవాలి. ఈ రకం కౌలు దారీకి 2,3 బస్తాల కంటే ఎక్కువ చివరికి మిగలదు. రెండవది పంటలో సగభాగం పంచుకునే పద్ధతి. పండిన పంట చెరిసగం. గడ్డి చెరిసగం ఇక మూడోది "మూడోవంతు పద్ధతి" దీని ప్రకారం కౌలు దారు ప్రతిరోజు ఉదయం(ఊళ్ళో ఉన్న గుడిలో హరిరామ గంట మోగేతెల్లవారు ఝూము నాలుగున్నర) నుండి పొద్దుపోయే దాకా పని చేయ్యాలి. ఏటా రెండు వేలరూపాయిల కూలి ప్రతి కౌలుదారుకి రెండున్నర ఎకరాల పొలం ఎరువుల్ని భూస్వామి ఇస్తాడు గానీ మిగితా వన్నీ వాళ్లే పెట్టుకోవాలి. పంటలో మూడో వంతు భాగం మాత్రమే వాళ్లకి దక్కుతుంది.

ఊరి పని చేసే వ్యవసాయ కార్మికులలో ఇక్కడ కాంట్రాక్టు పద్ధతి నడుస్తూంటుంది. నాట్ల కాంట్రాక్టులో రోజుకి 10-15 రూపాయలు కూలి. కోత కాలం కాంట్రాక్టులో 7-10 రూపాయిల కూలి. నూర్పిళ్లకి ధాన్యం రూపేనా కూలి చెల్లిస్తుంటారు. ఇందులో 18 గంటల పనికి సగటు 7 మానికలు 8 గంటలు పనికి 3 మానికలు, ధనరూపేన 7 నుండి 12 రూపాయిలు కూలి. రోజు కూలీలు కాక జీతగాళ్ళుకూడా ఉన్నారు. వీళ్ల సాధారణ వేతనం ఏటా 2 వేల రూపాయిలు. కాక మూడొందలకి, ఆరొందలకి పనిచేసే జీతగాళ్ళ నుండి 3 వేల పై చిలుకు పని చేసేదాక ఇతరులు కూడా ఉన్నారు.

చుట్టు పక్కల గ్రామాలలో కారంచేడు భూస్వామికి ఉన్న భూమిని వది లేస్తే మొత్తం కారంచేడులో 9 వేల ఎకరాల భూమి సాగులో ఉంది. ఇందులో 50 ఎకరాల పైనున్న కుటుంబాలు 100 ఉన్నాయి. 50-25 ఎకరాలున్న కుటుంబాలు మరో 100 ఉంటాయి. 25-10 ఎకరాల భూమి ఉన్న కుటుంబాలు 1,000 10-5 ఎకరాలున్న కుటుంబాలు 850. 5 కంటె తక్కువ ఎకరాలున్న కుటుంబాలు 200 భూమిలేని కుటుంబాలు 1300 మొత్తం సుమారు 3,500 కుటుంబాలు.

ఈ గ్రామంలో కొట్టొచ్చినట్టు కనబడే లక్షణం భూస్వాములకీ ఇతరు లకీ (కౌలుదార్లు రోజు కూలీలు, జీతగాళ్ళు) మధ్య సంబంధాలలో, పని పరిస్థి తులలో ఒక రకమైన నిర్బంధం. పనిచేయడానికి విధించిన నియమాలు ఉత్పత్తి అది పంపిణీ అయ్యే విధానం - అన్నీ ముందే నిర్ణయించిన ఇనుప చట్రంలో నడుస్తాయి. దాన్ని అమలు పరచడానికి అది ఉల్లంఘించినప్పుడు చర్యలు తీసు కోవడానికి భూస్వాములు కచేరీలు నడుపుతుంటారు. కారంచేడులో ఈ కచేరీల

న్యాయమే న్యాయం. ఇదే చట్టం అదే సమయంలో పెట్టుబడి, సాంకేతిక పరిజ్ఞానం పంట మారకం మొదలైన అన్ని విషయాల్లోనూ కారంచేడు ఆధునిక గ్రామం. అభివృద్ధి చెందిన గ్రామం.

ఒక రకంగా చూస్తే ఈ గ్రామంలో ఉత్పత్తి క్రమంలో ఏర్పడి బలపడిన సాంఘిక సంబంధాల చట్రంలో ఉన్న వ్యక్తుల్ని భూస్వాములు, ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు పేద రైతులు, భూమి లేని కూలీలు వగైరా సమూహాలుగా వర్గీకరించవచ్చు. మరోవైపు కుల ప్రాతిపదికగా వాళ్లని విభజించవచ్చు. మొత్తం జనాభాలో 6 వేలమంది కమ్మ వాళ్ళు, 1,100 మంది మాదిగలు, 900 మంది మాలవాళ్ళు, ఉప్పర, యాదవ, ముస్లిం తదితరులు 5,600.

19 వ శతాబ్దం పూర్వం నుండే భూమిమీద యాజమాన్యం కలిగిన వాళ్ళు కమ్మ వాళ్ళు శాశ్వత సెటిల్ మెంట్ పద్ధతిలో భూమిని పొగొట్టుకుంది కమ్మ రైతాంగమే. పొందిందీ వడ్డీ వ్యాపారస్తులైన కమ్మ భూస్వాములే. పాత కౌలుదారులు కమ్మరైతులే. వలసపోయిన వాళ్ళు వాళ్ళే ఆ తర్వాత కాలంలోనే మాదిగలు కౌలుదార్లు అయ్యారు. అందుకే వాళ్ళ జీవన పరిస్థితులు మెరుగయ్యాయి కూడా. కారంచేడులో ప్రధానంగా భూమి మీద యాజమాన్యంగల భూస్వాములు రైతులు, కమ్మవాళ్ళు - కౌలుదార్లు మాదిగలు. కూలి వాళ్ళలో కొందరు మాదిగలతో పాటు ఇంచుమించు ఇతరులంతా ఉన్నారు. జూలై 17 సంఘటన కమ్మలకీ మాదిగలకి మధ్య జరిగింది. ఇందులో మిగతావాళ్ళు ప్రేక్షకులే.

రాజకీయంగా కారంచేడు భూస్వాములు బ్రిటిష్ పాలన చివరి దశాబ్దాలలో రెండు గ్రూపులుగా ఉండే వాళ్ళు కాంగ్రెసు, జస్టిస్ పార్టీ. జస్టిస్ పార్టీ ప్రముఖ నాయకుడు జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి ఈ ఊరి వాడే (కారంచేడు అత్యాచారాన్ని ఖండిస్తూ గుంటూరులో అన్ని కాలేజీలు తరగతులను బహిష్కరిస్తే అందులో పాల్గొన నిరాకరించిన ఏకైక కాలేజి ఈయన పేరుతోనే పిలువబడ్తోంది) అయితే రెండు పార్టీలకు కూడా ప్రజా పునాది తక్కువే. కమ్మ సన్నకారు రైతులనుండి మాలమాదిగల దాకా అందరూ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోనే ఉండేవాళ్ళు (ఇప్పటికి కారంచేడులో ఒక కమ్మ వీధికి మాస్కో అని పేరు) కారంచేడు మొదటి పంచాయతీ సమితి అధ్యక్షుడు జాగర్లమూడి లక్ష్మీనారాయణ చౌదరి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి. ఆయన 1955 లో

ఆ గ్రామంనుండి అసెంబ్లీకి ఎన్నికయ్యాడు. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యవసాయ రంగంలో ఆధునిక సాంకేతిక విజ్ఞానం తీవ్రంగా ప్రవేశించని తొలి దశలో కారంచేడులో రాజకీయ ధోరణులకి కులంకంటె వర్గం ప్రాతిపదికగా కన్పిస్తుంది.

తర్వాత కాలంలో కమ్యూనిస్టు పార్టీని సమర్థించిన కమ్మ రైతాంగం పొగాకు ధనిక రైతులయ్యారు. వాళ్ళతో పాటు కమ్యూనిస్టు పార్టీ కూడా ధనిక, రైతు పార్టీ అయ్యిందిగాని వాళ్లు మాత్రం కమ్యూనిస్టులను వదిలేసారు. 1970 ల నాటినుండి మాలమాదిగలు ఇందిరాకాంగ్రెస్ వైపుకి వస్తే భూస్వాములు అటూ ఇటూ ఉండిపోయారు. తెలుగుదేశం పార్టీ వచ్చిన తర్వాత వాళ్ళంతా ఏకమయి ఆ పార్టీని సమర్థించారు. కుల ప్రాతిపదిక మీద సమర్థించారు.

కారంచేడులో దళితులు గాంధీగారు వాళ్ళకి హరిజనులు అని ముద్దు పేరు పెట్టడానికి కొంచెం అటు ఇటుగా క్రిస్టియన్ మతాన్ని పుచ్చుకున్నారు. మొన్న ఆసెంబ్లీ ఎన్నికల సమయంలో సగం కట్టిన చర్చికి ఎవరు డబ్బులిస్తే వాళ్ళకి ఓటేస్తామని అన్నారట. ఎన్నికలరోజు వచ్చినా ఆ వ్యవహారం తేలలేదు. సగం కట్టిన చర్చిని, సిలువ వేసిన క్రీస్తుని ఎవరూ పట్టించుకోలేదు కాని కమ్మవాళ్లు తమ తరపున దొంగ వోట్లు వేస్తున్నారని తెలిసి షెడ్యూల్డ్ కులాలు కాంగ్రెస్‌కి వోటేశారు. అప్పుడే జరగాల్సిన ఘర్షణ వాయిదా పడింది.

అసలు బయటి శక్తులేవీ తమ కింద పనిచేసే వాళ్ళ రాజకీయాభిప్రాయాలను ప్రభావితం చేయడం వాళ్ళ భాషలో చెప్పాలంటే కారంచేడు కమ్మల రక్తంలో లేదు. గ్రామం లోపల కూడా తమ నాయకత్వం కింద తప్ప ప్రజల ఐక్యతను వాళ్లు సహించలేరు. (కమ్యూనిస్టు పార్టీ రోజులలో కూడా అది కమ్మ నాయకత్వంలోనే ఉందని మనం గుర్తించాలి) 1974 లో జన నాట్యమండలి ప్రదర్శనపై వాళ్లు దాడి చేసారు. నాలుగు సంవత్సరాల క్రితం ఉప్పర కులస్తుల మీద దాడి జరిగింది. రెండు సంవత్సరాల క్రితం మాల వాళ్ళ మీద దాడి జరిగింది. ఇప్పుడు మాదిగల మీద మారణకాండ.

ప్రజానీకం పై ఈ రాజకీయ నియంతృత్వం మొత్తంగా బలపడిన వాళ్ళ సాంఘికాధికారంలో భాగం. కాస్త మంచిగుడ్డలు వేసుకుంటే ఎగతాళి చేయడం వర్ణాంతర వివాహం చేసుకున్న నేరానికి వెలివెయ్యడం, కమ్మవారివైపు ఉన్న రెండు టీ దుకాణాలలో మాలమాదిగలను బెంచీమీద కూచోనివ్వక పోవడం

అన్నీ కూడా ఈ సాంఘికాధికారంలో భాగమే. ప్రభుత్వ భూములు ఆక్రమించి డం, పేద రైతుల భూమిని బలవంతంగా గుంజుకోవడం, ఉత్పత్తి విధానం పైనా, పని పరిస్థితుల పైనా, పంటలపైనా, పంట వినిమయం పైనా తమ సంపూర్ణాధికారాన్ని స్థాపించుకోవడం ఈ సాంఘికాధికారానికి భౌతిక పునాది. కులాన్ని ప్రాతిపదికగా చేసుకున్న ఈ సాంఘికాధికారమే వైరుధ్యాన్ని కుల తగాదాగా వ్యక్తీకరిస్తుంది.

ఈ వంద సంవత్సరాల అభివృద్ధి క్రమ ఫలితమే ఈ దాడి. ఈ క్రమంలో శాశ్వత సెటిల్‌మెంట్ పేరుతో చట్టబద్ధ భూస్వామ్యం వొచ్చింది. ఉత్పత్తి మొత్తం పెరిగింది. సాంకేతిక మార్పులు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. రైతుల నైపుణ్యం పెరిగింది. ఉత్పత్తి శక్తి పెరిగింది. వ్యాపారీకరణ జరిగింది. దిన దిన ప్రవర్ధమానమయ్యే ఒక అంతర్జాతీయ పరిశ్రమ (పొగాకు) కు కారంచేడుకు అన్యోన్య సంబంధం స్థిరపడింది. ఈ క్రమంలో భాగంగానే ఏర్పడిన మానవ సంబంధాలలో కూడా రైతులు కౌలుదార్లు అయ్యారు. తిరిగి మళ్ళీ రైతుల య్యారు. భూస్వాములు వడ్డీ వ్యాపారస్తులయ్యారు. కూలీలు కౌలుదార్లు అయ్యారు. కొంతమంది కౌలుదార్లు వెట్టివాళ్ళు అయ్యారు. ఈ క్రమానికే మనం 'అభివృద్ధిక్రమం' అని పేరు పెట్టి పిలుస్తూంటాం.

అయితే ఈ అభివృద్ధికి రెండు ప్రధాన లక్షణాలు కొట్టొచ్చినట్టు కన్పిస్తు న్నాయి. మొదటిది దీనికి పునరుత్పత్తి స్వభావం (Self expanding Capacity) లేదు. అందుకు అది ఇతరేతర శక్తుల మీద ఆధార పడవలసి వస్తుంది. రాజ్యం యిచ్చిన నిరంతర సహాయం లేకుండా ఈ అభివృద్ధి నడిచేది కాదు. రేపు సామ్రాజ్యవాదులు తాము కంట్రోల్ చేసే పొగాకు టెక్నాలజీలో పెద్ద మార్పు ఏదైనా తీసుక వస్తే కారంచేడు ప్రభువులు ప్రభుత్వ సబ్సిడీల కోసం ఆందోళన చేయక తప్పదు. (అందుకు వాళ్ళు మాదిగల సహాయం అభ్యర్థించడానికి కూడా వెనుకాడరు) ఎటుపోయినా రాజ్యం సామ్రాజ్య వాదం సహాయం లేకుండా పునరుత్పత్తి చేసుకునే స్వభావం ఈ అభివృద్ధి క్రమానికి లేదు. రెండవ లక్షణం ఈ అభివృద్ధి క్రమ ఉత్పత్తి సంబంధాల స్వరూప స్వభావం. అవి సాంఘికంగా, సాంస్కృతికంగా తమదంటూ ఒక స్వభావాన్ని సంతరించుకోలేవు. ప్రత్యక్ష నిర్బంధం లేకుండా ఈ పెట్టుబడి ఆధునిక సాంకే తిక విజ్ఞానం అదనపు విలువలను ఉత్పత్తి చెయ్యలేవు. అందుకే ఈ మార్పులకి నిర్బంధాన్ని కొనసాగించడానికి భూస్వామ్య భావజాలం అవసరం అయ్యింది. మన ధర్మశాస్త్రం నుండి తెలుగుదేశం పార్టీ దాకా అన్నీ ఇందుకు తోడ్పడుతూ

ఉంటాయి. నిర్బంధ పూరిత భూస్వామ్య సాంఘిక సంబంధాల చట్రం లేకుండా ఈ అభివృద్ధి క్రమం ఒక్క అడుగు ముందుకు వెయ్యలేదు. ఫలితంగా వెట్టి వాళ్ళయినా పాలేర్లయినా కూలీయైనా, కౌలుదార్లయినా, రైతులయినా మాదిగలు 'మాదిగ లంజలు, మాదిగ లంజాకొడకులు' గానే తప్ప మరోలా పిలువబడరు. మరోలా చూడబడరు. వాళ్ళు మంచి నీళ్ళు తాగే చెరువులో వీళ్ళు గేదెలు కడుక్కోవచ్చు.

ఈ సంకరాభివృద్ధిక్రమం మాల మాదిగల జీవితంలో తీవ్రమయిన మార్పుల్ని తీసుక వచ్చింది. వాళ్ళ జీవన స్థితిగతుల్ని కొంత మేరకు మెరుగు పరిచింది. పెరుగుతున్న రాజకీయ చైతన్యం వాళ్ళ జ్ఞానాన్నీ, ఆత్మ చైతన్యాన్ని కూడా విస్తృతం చేస్తుంది. అది తమను తాము ఇంకెంత మాత్రము 'లంజల కిందా లంజా కొడుకుల' కింద పరిగణించదు. ఎదురు నిలబడి ప్రశ్నిస్తుంది. జూలై 16 మధ్యాహ్నం చెరువు దగ్గర తేళ్ళ సువార్త అ పనే చేసింది. ఎదురు దెబ్బ కుల దురహంకారానికి తగిలింది, అభివృద్ధి చెందిన ఆధునిక భూస్వామ్య రాజకీయ సాంఘిక అధికారానికి తగిలింది. ఈ రెంటి అడుగున ఉండే మగ దురహంకారానికి కూడా తగిలింది జూలై 17 దాడి జరిగింది. మన అభివృద్ధి క్రమం సృష్టిస్తున్న వైరుధ్యాల పురోగమనానికి అంతంకాదిది ఆరంభం.

ఈ అభివృద్ధిక్రమ కథ ఇక్కడితో ఆపేస్తే దీనికి ఆ అభివృద్ధికి పట్టిన గతే పడుతుంది. దీన్ని పూర్తి చేయాలంటే ఈ క్రమ ఫలితంగా మంథనిలోనూ, మహదేవ్‌పూర్‌లోనూ పొగాకు పంటల వల్ల వచ్చిన పరిణామాల గురించి కూడా చెప్పకోవాలి. ఎవరి భూమి పోయింది, ఎవరి చేతుల్లోకి పోయింది, పొగాకు పండించే నైపుణ్యంలేని పాత రైతులేమయ్యారు. కూలీలేమయ్యారు. అక్కడి ఉత్పత్తి క్రమం బయటికి ఎవరెవరు ఎక్కడెక్కడికి విసిరేయి బడ్డారు మొదలైన అన్ని అంశాలు పరిగణనలోకి తీసుకోవాలి. అది కారంచేడు అభివృద్ధిక్రమ పరిధిలో కనబడదు. అయితే ప్రస్తుతానికి మాత్రం మన మొక్క విషయం గమనించాలి. అక్కడ కూడా సంఘర్షణ ఉంది. అక్కడ కూడా మాల మాదిగ యువకుల మీద దాడులు జరుగుతున్నాయి. ఆ దాడి "అరుదుగా జరిగే ఒక అత్యాచారం" కాదు. రాజ్యం సంఘటితంగా నిర్వహిస్తున్న ఎన్‌కౌంటర్ హత్యా కాండ అక్కడ మరణిస్తున్న మాల మాదిగలు 'హరిజనులు' కారు. వాళ్ళు రాడికల్స్.

(కృతజ్ఞతలు : డి. నర్సింహ రెడ్డి గారికి)

# రిజర్వేషన్ విధానం

కొద్ది నెలల క్రితం గుజరాత్‌లో జరిగిన మారణకాండలో రిజర్వేషన్‌పై ఉద్రేకాలు మరోసారి చెలరేగాయి. దేశవ్యాప్తంగా రిజర్వేషన్ కొనసాగాలనే వారి వద్దనే వాళ్ళ మధ్య వాదనలు మళ్ళీ తీవ్రస్థాయికి చేరుకున్నాయి. ప్రస్తుత సామాజిక సంక్షోభంలో ఈ ఆందోళన ఒక మలుపు. పాలకులలో విభిన్న సెక్షన్ల మధ్య, పాలకులకు, పాలితులకు మధ్య వైరుధ్యాలను తీవ్రతరం చేస్తున్న ఈ సమస్య స్వభావాన్ని గురించి స్పష్టతకోసం ఈ వ్యాసం ఒక ప్రయత్నం.

ప్రస్తుతం మన దేశంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలోనూ, వాటి అధీనంలోను ఉన్న సంస్థలలోను కలిపి సుమారు కోటి 60 లక్షల మంది పని చేస్తున్నారు. దేశ శ్రామిక జనాభాలో వీళ్ళ శాతం 2.2 మాత్రమే. ఈ సంస్థలలో ప్రతి సంవత్సరం కొన్ని వేల మందికి మాత్రమే ఉద్యోగావకాశాలున్నాయి. అలాగే దేశంలోని వృత్తి విద్యా (మెడికల్, ఇంజనీరింగ్ మొదలైన) సంస్థలలో 5 లక్షల మంది విద్యార్థులున్నారు. దేశంలోని విద్యారంగంలో వీళ్ళ శాతం 0.29 మాత్రమే. ఇంత మారణకాండకు దారి తీస్తున్న ఈ ఆందోళన అంతా ఈ రెండు శాతం శ్రామిక జనాభా చుట్టూ, 0.2 శాతం విద్యార్థి జనాభా చుట్టూ తిరుగుతుంది. ఎందుకు?

అసలు 1970 ల నాటి నుండే దేశ ఆర్థికాభివృద్ధి కుంటుపడింది. ఫలితంగా ఉద్యోగావకాశాలు రానురాను తగ్గిపోతున్నాయి. 60 లలో ప్రైవేటు రంగంలో ఏటా 12 శాతం ఉద్యోగావకాశాలు పెరిగితే, ప్రభుత్వ రంగంలో 5 శాతం పెరిగాయి. 1970 ల కొచ్చేసరికి ప్రైవేటు రంగంలో ఉద్యోగాలు మూడు శాతం పెరిగితే ప్రభుత్వ రంగంలో 5 శాతం పెరిగాయి. 1985 లో రెండు కోట్ల ముప్ఫై లక్షల మంది నిరుద్యోగులున్నట్లు ప్రభుత్వ అంచనాలు తెలియజేస్తున్నాయి. ఇందులో ఇరవై లక్షల గ్రాడ్యుయేట్లు, 20 వేల డాక్టర్లు, 24 వేల ఇంజనీర్లు కూడా ఉన్నారు. నిరుద్యోగం ఉద్యోగావకాశాలకంటే తీవ్రంగానే పెరుగుతోంది కాబట్టి సహజంగానే దొరికే ఉద్యోగాల కోసం పోటీ పెరిగిపోతుంది. ఆ పోటీ ఈ రిజర్వేషన్ ఆందోళనలో ప్రతిఫలిస్తోంది. మెడికల్ ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్లకు కూడా ఉద్యోగావకాశాలు తక్కువే అయినా ఇతరత్రా వాళ్ళకి సంపాదనావకాశాలు ఎక్కువ కావడంతో (కట్నాల నుండి కాంట్రాక్టుల దాకా) వీటి కోసం కూడా పోటీ పెరిగింది. విజ్ఞాన శాస్త్రాన్ని

నేర్చుకున్న విద్యార్థులు ఆ శాస్త్రాన్ని ఉపయోగించుకొనకుండా ఇతర త్రా మాత్రమే సంపాదించే గతికి చేరుకున్నాక ఆర్థికాభివృద్ధిక్రమంలో ఈ రకం పోటీ పెరగక తప్పదు. ఒక్క మాటలో చెప్పాలంటే రిజర్వేషన్ విధానాలపై ఆందోళన ఆర్థికాభివృద్ధిక్రమంతోను, సామాజిక సంక్షోభంతోనూ ముడిపడి ఉంది. కాని ఈ విషయం ఇంత స్పష్టంగా ప్రజలకు కన్పిస్తే ఈ రకమైన ఆందోళనలు జరిగేవి కావు. అలా కన్పడకుండా, ఈ సమస్యపై వంద సంవత్సరాల తప్పుడు చైతన్యం పేరుకు పోయింది. అది వలస పాలనతో మొదలయింది.

1858 పూర్వం కంపెనీ పాలనలో ప్రభుత్వ విద్యా సంస్థలలో అస్పృశ్య కులాల నుండి వచ్చిన పిల్లలకు ప్రవేశం ఉండేది కాదు. 1858 లో రాణీ గారి ప్రభుత్వం వాళ్ళకు కూడా ప్రవేశానుమతి ఇచ్చింతర్వాత అగ్రకులాలు ఆ పాఠశాలల్లో ప్రవేశించ నిరాకరించాయి. రాజీ మార్గంగా ప్రభుత్వం అస్పృశ్యు లకు ప్రత్యేక పాఠశాలలను ఆరంభించింది.

1885 లో మద్రాసు ప్రభుత్వం విద్యా సంస్థలకు ఆర్థిక సహాయాన్ని ఇస్తూ అణచబడ్డ కులాలకు కొన్ని ప్రత్యేక సౌకర్యాలను ఇచ్చింది. 1921 లో ఆ ప్రభుత్వమే ప్రభుత్వోద్యోగాలలో బ్రాహ్మణేతరుల ప్రాతినిధ్యాన్ని పెంచ డానికి కొన్ని చర్యలు తీసుకొంది. 1927 లో ఈ విధానం విస్తృతిలోను, వైవిధ్యంలోను కొత్త రూపాన్ని తీసుకుంది. ఒక రకంగా ప్రస్తుత రిజర్వేషన్ విధానానికి మూలం ఇదే. కమ్యూనల్ ఆర్డర్ అని పిలువబడిన ఈ విధానం ప్రకారం మొత్తం జనాభాను 5 గ్రూపులుగా విభజించి ఉద్యోగాలలో వాళ్ళ శాతాన్ని నిర్ణయించింది. 1950 లో సుప్రీం కోర్టు రాజ్యాంగ విరుద్ధమని కొట్టి వేసేదాకా ఇది కొనసాగింది. సంస్థానాలలో మైసూర్ సంస్థానం 1904 లోనే బ్రాహ్మణేతరులకు ఉద్యోగాలలో రిజర్వేషన్ కల్పించింది.

దేశ స్థాయిలో రిజర్వేషన్ విధానం మాంటేగ్, ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలతో (1919) ఆరంభమయింది. అప్పట్లో ఈ రిజర్వేషన్ విధానం షెడ్యూల్డు కులాలకే కాక, ముస్లింలకు, సిక్కులకు క్రిష్టియన్లకు కూడా వర్తించేది. అయితే గిరిజనులకు ఉండేది కాదు. భారత రాజ్యాంగాన్ని రూపొందించిన రాజ్యాంగ పరిషత్తు మైనారిటీ కమీషన్ సూచనల ఆధారంగా షెడ్యూల్డు తెగలకు, షెడ్యూల్డు కులాలకు రిజర్వేషన్ సౌకర్యం కల్పించింది. ముస్లిం, సిక్కు, క్రిష్టియన్ మొదలైన మత రీత్యా మైనారిటీలకు రిజర్వేషన్లు రద్దు చేశారు. రాజ్యాంగంలోని 16 వ ప్రకరణం ప్రకారం నిర్ణీత (షెడ్యూల్డు) కులాలకు

తెగలకు ప్రత్యేక సౌకర్యాలను ఇచ్చే అధికారం ప్రభుత్వం పొందింది. ఈ నిర్ణీత కులాల్లో ఉన్నవాళ్ళే షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు అవుతారు. ఈ పట్టిక అవసరమనుకుంటే పెంచడానికికాని, తగ్గించడానికికాని పార్లమెంటుకు అధికారాలున్నాయి. 1951 లో రాజ్యాంగ సవరణ ద్వారా ఈ సౌకర్యాలను వెనుకబడిన కులాలకు కూడా వర్తింపజేసే అధికారం ప్రభుత్వానికొచ్చింది. వెనుకబడిన కులాల కోసం ప్రత్యేకంగా కమీషన్‌ను నియమించే అధికారం కూడా ప్రభుత్వం కల్గి ఉంది. ఫలితంగా 1955 లో ఒక కమీషన్ (కాకాకాలేకర్), 1978 లో మరో కమీషన్ (మండల్) నియమించబడ్డాయి. అంతే కాక రాష్ట్ర ప్రభుత్వాలు కూడా రిజర్వేషన్ల సమస్యపై అనేక కమీషన్లను నియమించాయి. మన రాష్ట్రంలో కూడా 1970 లో ఒక కమీషన్ (మనోహర ప్రసాద్), 1982 లో మరో కమీషన్ (మురళీధరరావు) నియమింపబడ్డాయి. మొత్తం 20 కి పైగా నియమింపబడ్డ ఈ కమీషన్ల సిఫార్సులలో కొన్ని అమలు చేయబడ్డాయి, కొన్ని నిరాకరించబడ్డాయి, కొన్ని అసలు వెలుగులోకే రాలేదు. కొన్ని సందర్భాలలో ఈ కమీషన్లు ఆందోళనకు పరిష్కారంగా వస్తే, కొన్ని సందర్భాలలో ఆందోళనలకు అవే కారణమయ్యాయి. (ప్రస్తుతం మండల్ కమీషన్ నివేదిక ఈ కోవకు చెందినదే).

ఈ పరిణామాలన్నిటి ఫలితంగా ప్రస్తుతం ఉద్యోగ, విద్యా రంగాలలోని రిజర్వేషన్ విధానం అమలులోకివచ్చింది. జాతీయ స్థాయిలో ప్రభుత్వ ఉద్యోగాలలోను, విద్యా సంస్థలలోను 15 శాతం షెడ్యూల్డు కులాలకి, 7.5 శాతం షెడ్యూల్డు తెగలకు రిజర్వేషన్ ఉంది. కేంద్ర స్థాయిలో వెనుకబడిన కులాలకి రిజర్వేషన్లు లేవు. రాష్ట్రాల స్థాయిలో షెడ్యూల్డు కులాలకి, తెగలకి మాత్రమే కాక, కొన్ని రాష్ట్రాలలో వెనుకబడిన కులాలకి కూడా రిజర్వేషన్ సౌకర్యం ఉంది. అయితే వెనుకబడిన కులాలకి ఈ రిజర్వేషన్ వివిధ రాష్ట్రాలలో, వివిధ శాతాలలో ఉంది. ఉదాహరణకి తమిళనాడులో 50 శాతం, కర్ణాటకలో 48 శాతం, బీహార్‌లో 25 శాతం, ఉత్తరప్రదేశ్‌లో 15 శాతం, కేరళలో 26 శాతం, మహారాష్ట్రలో 14 శాతం, ఆంధ్రప్రదేశ్‌లో 25 శాతం ఉంది.

ఈ రిజర్వేషన్ల విధానం అనేక విధాలుగా వివాదాస్పదమయింది. కొందరు మొత్తం రిజర్వేషన్లను సూత్రప్రాయంగా అంగీకరిస్తూ, రిజర్వేషన్లు ఇచ్చే పద్ధతిలో మార్పు ఉండాలని సూచిస్తున్నారు. వీరి వాదనలన్నింటిని మనం సీరియస్‌గా పట్టించుకోవాల్సిన అవసరం లేదు కాని, అవేమిటో కొంత తెలిసి ఉండడం

అవసరం. ఈ దృష్టితో మొట్టమొదట రిజర్వేషన్లు పూర్తిగా తోసివేయాలనే వారు కారణాలేమి చెబుతున్నారో పరిశీలిద్దాం.

రిజర్వేషన్లను వ్యతిరేకించేవారు చెప్పే కారణాలు ప్రధానంగా :

1. రిజర్వేషన్లు ప్రజాస్వామిక సూత్రలకు విరుద్ధం. ప్రజాస్వామ్యం ప్రజలందరు సమానమని, సమానమైన హక్కులు, అవకాశాలు కలిగి ఉంటారనే భావనలపై ఆధారపడిన వ్యవస్థ. ఈ వ్యవస్థ కొంత మందికి ప్రత్యేకమైన సౌకర్యాలు కలుగజేయడం దీని మౌలిక సూత్రాలకే భిన్నమైనది.

2. పరిపాలనా సామర్థ్యాన్ని రిజర్వేషన్లు దెబ్బ తీస్తాయి. సమర్థులైన వారిచే పాలన కొనసాగించాలని కోరుకునే హక్కు ప్రజలందరికి ఉంది. రిజర్వేషన్ల పేరుతో తక్కువ సమర్థులైన వారికి ఉద్యోగాలు, ప్రమోషన్లు ఇచ్చినందు వల్ల, అది మిగిలిన ఉద్యోగుల నైతిక స్థాయిని దెబ్బతీయడమే కాక, సమాజ అభివృద్ధికి కూడా ఆటంకం ఏర్పడుతుంది. ఉద్యోగం వ్యక్తి శ్రేయస్సు కోసం, అని కాక దానికొక సామాజిక కర్తవ్యం ఉంటుందనుకున్నప్పుడు అందరిలోకి సమర్థులైన వారికే ఉద్యోగాలివ్వడం, ప్రమోషన్లు ఇవ్వడం అవసరం. రిజర్వేషన్లు ఈ పాలనా నియమాలకు వ్యతిరేకం.

విద్యారంగంలో రిజర్వేషన్ల వల్ల యోగ్యతకు గుర్తింపు లేకుండా పోతుంది. అర్హులైన వారి విద్యావకాశాలకు దెబ్బ కలుగుతుంది. మంచి మార్కులతో పాసయిన వారికి కళాశాలలో సీట్లు లభించక, చాలా తక్కువ మార్కులు వచ్చిన వారికి సీట్లు వస్తాయి. ఈ పరిస్థితి వల్ల సమాజం యోగ్యతను గుర్తించటం లేదనే భావం యువకుల్లో కలుగుతుంది. యోగ్యుల సేవలను సమాజం ఉపయోగించుకోడానికి కూడా రిజర్వేషన్లు అవరోధంగా ఉంటాయి. ఒక్క మాటలో చెప్పాలంటే పరిపాలనలో సమర్థతకు, విద్యారంగంలో యోగ్యతకు రిజర్వేషన్లు ఆటంకమవుతాయి.

3. ఈ రిజర్వేషన్లు సామాజిక న్యాయ సూత్రాలకు కూడా వ్యతిరేకం. తరతరాల అసమానతలను రూపుమాపడానికి ఈ రిజర్వేషన్లు ప్రవేశపెట్టారని భావించినా, గత తరాలు చేసిన తప్పులకు ఈ తరం వారిని శిక్షించడం భావ్యం కాదు. మేము ఏ పాపం చేయకుండా ఎంతో కష్టపడి చదువుకుని మంచి మార్కులు సంపాదించుకుంటుంటే, మేం పుట్టిన కులం కారణంగా (దానికి మా బాధ్యత ఏమీ లేకపోయినా) మమ్మల్ని శిక్షించడం సమసమాజ సాంఘిక న్యాయ సూత్రలకే విరుద్ధం.

4. రిజర్వేషన్ల విధానం సామాజిక ఘర్షణకు దారితీస్తుంది. సమాజంలో ప్రత్యేక హక్కులు పొందేవర్గం, ఆ హక్కులులేని వర్గం అని రెండు వర్గాలు ఏర్పడి. వారి మధ్య ఘర్షణకు రిజర్వేషన్లు కారణమవుతాయి. ఉద్యోగులలో రిజర్వేషన్ కేటగిరి, నాన్ రిజర్వేషన్ కేటగిరి అని రెండు వర్గాలు ఏర్పడి పాలనా వ్యవస్థలో ఉండాల్సిన ఐక్యతా భావాన్ని దెబ్బతీస్తుంది. అదే విధంగా విద్యారంగంలో విద్యార్థులలో కులం ప్రాతిపదికమీద విభజనకు, ఘర్షణలకు రిజర్వేషన్లు దారి తీస్తాయి. ఒక విధానం యొక్క సామాజిక ప్రయోజనానికి అది ఎంతవరకు ప్రజలమధ్య సఖ్యతను పెంపొందిస్తుంది అనేది ఒక గీటురాయి ఆ దృష్టిలో రిజర్వేషన్లు సామాజిక వ్యతిరేకమైన విధానం.

5. రిజర్వేషన్ సౌకర్యాలను వెనుకబడ్డ తరగతులలో సంపన్నులయిన కొద్ది మంది మాత్రమే పొందుతారు. దీనివల్ల ప్రయోజనం బీద వారికి కలుగదు. బీదవారి పేరుతో కొద్దిమంది సంపన్నులు ఈ ప్రయోజనాలను పొందుతారు. అంతేకాక వారికి ఈ విధానాలలో శాశ్వత స్వప్రయోజనం కూడా ఉంటుంది. సంపన్నులైన వెనుకబడ్డ వర్గాలకు చెందిన అధికారులు, రాజకీయ నాయకులు, వివిధ వృత్తులలో ఉన్న వారి పిల్లలు ఈ ప్రయోజనం పొందడం దీనికి ఉదాహరణగా చెప్పవచ్చు.

6. రిజర్వేషన్లు వెనుకబడ్డ తరగతులవారి మౌలిక సమస్యలను పరిష్కరించలేవు. వారి మౌలిక సమస్యలైన పేదరికానికి, నిరుద్యోగ సమస్యకు ఇవి పరిష్కారాలు కావు. పేదవారందరికి చదువుకోవడానికి అవకాశం కల్పించటం రిజర్వేషన్లవల్ల సాధ్యంకాదు. కాని రిజర్వేషన్లవల్ల కొన్ని సౌకర్యాలు పొందడానికి వీలున్నందువల్ల, పేదవారిలో భ్రమలు పెరగడానికి ఈ విధానం కారణం అవుతుంది. దానివల్ల పేదవారిలో వ్యవస్థలోని లోపాలకు వ్యతిరేకంగా పోరాడే శక్తి, అభిలాష తగ్గిపోతాయి. వ్యవస్థపై భ్రమలు పెరుగుతాయి. ఆ విధంగా రిజర్వేషన్లు ఉన్న వ్యవస్థను కాపాడుకోవటం కోసం పాలకులు రూపొందించిన విధానం. ఈ వాదం ముఖ్యంగా వ్యవస్థ మారాలని కోరుకునే వాళ్ళు చేస్తుంటారు.

పైన పేర్కొన్న వాదనలన్నింటిని రిజర్వేషన్ వ్యతిరేకించేవారందరూ చేస్తున్నారని కాదు. అంతేకాక ఈ పై కారణాలవల్లనే రిజర్వేషన్లను వ్యతిరేకించేవారు, ఉద్యమాలను నడుపుతున్నారని, మారణకాండను కొనసాగిస్తున్నారని చెప్పడం ఉద్దేశం కాదు. ఇవన్నీ కూడా రిజర్వేషన్ వ్యతిరేకవాదులు పైకి చెబు

తున్న, తమ చర్యల హేతుబద్ధతను నిరూపించుకోవడం కోసం చేస్తున్న వాద నలు. అసలు కారణం పెరుగుతున్న సామాజిక సంక్షోభ పరిస్థితులలో తమస్వ ప్రయోజనాలను రక్షించుకోవడం కోసం పాలకులు చేస్తున్న మారణకాండ కావచ్చు. ఆ విషయాన్ని గురించి తరవాత పరిశీలిద్దాం.

మొదట ప్రజాస్వామ్య సూత్రాలకు వ్యతిరేకమనే వాదనను పరిశీలిద్దాం. అసమాన సమాజంలో సమానత్వాన్ని పాటించడం, ఇంకొక రకంగా అసమాన తలను కొనసాగించడమే అవుతుంది. పేదవారు, ధనికులు ఉన్న సమాజంలో ఇద్దరికీ ఒకే అవకాశాలు కల్పించి పోటీ పడమనడం ఆచరణలో ధనికులకు అవకాశం కల్పించడమే అవుతుంది. అసమానతలను తొలగించడం సామాజిక లక్ష్యమయినప్పుడు వెనుకబడి ఉన్న వారికి ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వడం తప్పనిసరి. అప్పుడు మాత్రమే వారు ఇతరులతో సమానులు కాగలుగుతారు. సమానత్వం అంటే సమాన అవకాశాలు అనే పరిమితార్థంలోనే కాక, సమాన ఫలితాలు అనే విస్తృతార్థంలో చూడాలి. అసమాన సమాజంలో సమాన ఫలితాలు ప్రత్యేక అవకాశాల ఆధారంగానే సాధించగలం. కాబట్టి రిజర్వేషన్లు ప్రజా స్వామ్య సూత్రాలకు వ్యతిరేకం కాదు.

రెండవ వాదన, రిజర్వేషన్లవల్ల సమర్థత, యోగ్యత దెబ్బతింటుందనేది. ఇది చాలా బలమైన వాదన. చాలా ఎక్కువ మంది చేస్తున్న వాదన. చాలా ఎక్కువ మంది నిజంగా నమ్ముతున్న వాదన కూడా. దీనికి సమాధానం రెండు స్థాయిలలో చెప్పవచ్చు. ప్రభుత్వ పాలనలు సమర్థత విషయానికొస్తే రిజర్వేషన్ల వల్ల ఇది దెబ్బ తింటుందనేది, ఒక ఊహాత్మక భావనగానే కన్పడుతుందికాని దానికి సాక్ష్యాధారాలు లేవు. షెడ్యూలు కులాలకు, షెడ్యూలు తరగతులకు చెందిన అధికారులు మిగిలిన అధికారుల కంటే తమ పనిలో అసమర్థులనే సాధారణీకరణ చేయలేం. రిజర్వేషన్ల ద్వారా నియమించబడ్డ అధికారులలో ఓపెన్ కాంపిటీషన్ ద్వారా నియమించబడ్డ అధికారుల కంటే సమర్థులయిన వారు మనకు ఎంతో మంది కన్పడతారు. అదే విధంగా అసమర్థులు కూడా రెండు కాటగరీలలోనూ ఉన్నారు. సమర్థతకు, అసమర్థతకు వారు ఎంపిక చేయబడ్డ పద్ధతికి (అంటే రిజర్వేషనుకు) సంబంధం ఉన్నట్లు కనబడదు. భారత ప్రభుత్వంలో కేబినేట్ సెక్రటరీగా పని చేసిన మెహతా ఈ విషయం గురించి రాస్తూ తన 30 సంవత్సరాల అనుభవంతో రిజర్వేషన్లు పాలనలో సామర్థ్యాన్ని దెబ్బతీస్తున్నాయని చెప్పలేమన్నాడు. ఇంజనీరు సమర్థత అతని విజ్ఞానంకంటే కూడా, అతని విలువలపైన ఆధారపడి ఉంటుందనే విషయాన్ని

మనం గుర్తుంచుకోవాలి. మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడైన ఇంజనీరు కాని, డాక్టరు కాని, లేక ఇంకో ఉద్యోగి కాని, తన పనిని రెండవ శ్రేణిలో ఉత్తీర్ణుడైనవారి కంటే సమర్థవంతంగా చేస్తాడని చెప్పలేం. కాంట్రాక్టర్లతో కుమ్మక్కయ్యే మొదటి శ్రేణి ఇంజనీరు కంటే, మూడవ శ్రేణిలో పాసై తన ధర్మాన్ని నిర్వహించడంలో నియమాలను పాటించే ఇంజనీరు, సమాజానికి ఎక్కువ ఉపయోగపడతాడు. కాబట్టి సమర్థత (efficiency) అంటే ఏమిటి అనే విషయాన్ని నేడు నిర్ణయిస్తున్న పద్ధతిలోనే లోపం ఉంది. అటువంటప్పుడు సమర్థతకు రిజర్వేషన్లు ఆటంకం అనడంలో అర్థంలేదు. అదే విధంగా విద్యాలయాల్లో యోగ్యత అనేది కూడా సరిగా నిర్ణయం జరగడం లేదు. మార్కులను యోగ్యతకు గీటు రాళ్ళగా తీసుకుంటున్నారు. మార్కులను సంపాదించడానికి అనేక మార్గాలున్న నేటి కాలంలో, మార్కుల ఆధారంగానే వ్యవస్థను నిర్మించడం, పరిశీలించడం సమంజసం కాదు. ఎక్కువ మార్కులు వచ్చిన వారు తక్కువ మార్కులు వచ్చిన వారి కంటే తెలివిగల వారనడం సమంజసమేనా? ఒక వేళ వాదనకు ఎక్కువ తెలివిగలవారని అంగీకరించినా, వీరి తెలివి సమాజానికి ఉపయోగపడుతుందని చెప్పగలమా? ఈ విషయాలన్నింటికీ సంతృప్తికరమైన సమాధానాలు లేకుండా, మార్కులనుబట్టి యోగ్యతను నిర్ణయించి, ఆ యోగ్యత ఆధారంగా సమర్థతను నిర్ణయించి, వీటన్నింటికీ రిజర్వేషన్లు వ్యతిరేకంగా ఉన్నాయని భావించడం సరి అయినది కాదు. మరి కొందరు రిజర్వేషన్ల సౌకర్యం అనేది తరతరాలుగా వెనుకబడ్డ వారికి సమాజం చేసిన అన్యాయానికి ప్రతిఫలంగా భావిస్తూ, సమర్థత యోగ్యతల విషయంలో కొంత రాజీ పడటం తప్పనిసరని భావిస్తున్నారు.

ఇక్కడ గత తరాలు చేసిన అన్యాయానికి ఈతరం వారు ప్రతిఫలం చెల్లించాలనడం ఎంతవరకూ సమంజసమనే వాదం వస్తుంది. ఈ వాదం సామాజికాభివృద్ధిలో చారిత్రక పరిస్థితుల ప్రభావాన్ని గుర్తించక చేసే వాదం. సమాజం అకాశంనుంచి ఊడిపడలేదు. ఎన్నో వేల, సంవత్సరాల పరిణామక్రమంలో మన సమాజం నేటి రూపం తీసుకుంది. మా పూర్వీకులు చేసిన వాటికి మేమెందుకు ప్రతిఫలం చెల్లించాలనే వాళ్ళు ఎంతో ఆనందంతో పూర్వీకుల ఆస్తిని వారసత్వంగా పొందటంలో తమ కభ్యంతరం లేదనే విషయాన్ని మర్చిపోతున్నారు. మనం మన పూర్వీకుల సంపదకు ఏ విధంగా వారసులమో, వాళ్ల చర్యల ప్రభావాలకు కూడా వారసులమనే విషయాన్ని మర్చిపోగూడదు. మనం ఈనాడు ఇతరులతో పోల్చినట్లయితే, గొప్ప తెలివిగలవారుగా ప్రదర్శించు

కోవడానికి అవకాశం ఉందంటే, దానికి కారణం మన పూర్వీకులు తరతరాలుగా యితరులను అణిచి ఉంచడమే అనే సత్యాన్ని గుర్తించాలి.

సమాజంలో ఘర్షణలకు రిజర్వేషన్లు దారి తీస్తాయనేది మనకు ఎంతో వాస్తవం చెప్పినట్లు అన్పిస్తుంది. కానీ ఇది లక్షణాన్ని కారణంగా నిర్ణయించడం వంటిది. రిజర్వేషన్ల పేరు మీద ఘర్షణలు జరగవచ్చు. కులంపేరు మీద ఘర్షణలు జరగవచ్చు. కానీ యివన్నీ కూడా మనకు బైటకు కన్పడే లక్షణాలు మాత్రమే. రిజర్వేషన్లకు, కులానికి కారణమైన అసమానతలు, ఆర్థిక సాంఘిక రంగాలలో ఉన్నంతవరకూ సమాజంలో ఘర్షణలు జరుగుతూనే ఉంటాయి. ఘర్షణలు నివారించడానికి మార్గం రిజర్వేషన్లు తీసివేయడం కాదు. రిజర్వేషన్లను కారణమైన పరిస్థితులను మార్పు చేయడం. సమాజంలో ఘర్షణలు ఉండ కూడదనే శాంతికాముకులు దోపిడీ ఉండకూడదంటే ఏమంటారో!

రిజర్వేషన్లవల్ల ప్రయోజనాలు వెనుకబడ్డ తరగతులలోని సంపన్నులకే చెందుతున్నాయని విమర్శలో చాలా వరకు నిజమున్నది. అంతేకాక ఈ విధానం వెనకబడ్డ తరగతుల్లో భ్రమలు కల్గించి, తప్పుడు చైతన్యానికి దారి తీస్తుందనే అభిప్రాయం కూడా ఉంది. ఈ విమర్శలను తేలిగ్గా కొట్టివేయడానికి వీలులేదు. అయితే, రిజర్వేషన్ విధాన స్వభావాన్ని మనం ఇక్కడ అర్థం చేసుకోవాలి. ఇది ఒక సంస్కరణ విధానం. అంటే వ్యవస్థలో కొన్ని మార్పులు చేయడానికి ఉద్దేశించిన విధానం. ఉన్న వ్యవస్థలో మౌలికమైన లోపాలే లేవనే భావంతో, అక్కడ కూడా కొన్ని మార్పులు చేయాలనే ఉద్దేశ్యంతో తీసుకొనే చర్యలను సంస్కరణ చర్యలు అంటారు. ఈ సంస్కరణ విధానాలవల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. నేడు రిజర్వేషన్ విధానం వల్లనే వెనకబడ్డ తరగతుల వారు ఎంత తక్కువగానయినాసరే ప్రభుత్వోద్యోగాలలో ఉన్నారనే విషయాన్ని గుర్తించాలి. 1969 నుంచి 1978 వరకూ ఐ ఎ ఎస్ పరీక్షలో ఓపెన్ కాంపిటీషన్‌లో 10 మంది మాత్రమే ఉత్తీర్ణులయ్యారనే సత్యం, రిజర్వేషన్లు లేనట్లయితే వెనకబడ్డ తరగతుల వారు ఉన్నత పదవులు పొందడం కష్టమనే విషయాన్ని నిరూపిస్తుంది. వెనకబడ్డ తరగతుల్లోని పై అంతస్తులోని వారే ఈ సౌకర్యాలు పొందారనేది వాస్తవం. ఈ విధానంలోనే, ఈ వ్యవస్థలోనే ఇది ఇమిడి ఉంది. క్రమక్రమంగా సౌకర్యాలనే విస్తరించే విధానంలో మొట్టమొదట ఆ సౌకర్యాలను పై అంతస్తులోని వారు మాత్రమే పొందుతారు. రిజర్వేషన్ల వ్యతిరేక వాదులు ఈ వాదన చేస్తున్నది వెనుకబడ్డ తరగతులలోని పేద వారిపై ప్రేమతో కాదు. వెనకబడ్డ తరగతులలోని పై అంతస్తులోని వారు తమకు

పోటీ వస్తున్నారనే కక్షతో పేదవారి పట్ల ప్రేమ ఒలకపోస్తున్నారు. ధనికరైతుల మీద ఉన్న వ్యతిరేకతతో పారిశ్రామిక వేత్తలు పేద ప్రజలంటే చూపించే సాను భూతి ఇటువంటిదే.

రిజర్వేషన్లు తప్పుడు చైతన్యానికి కారణమవుతున్నాయనే విషయాన్ని కూడా జాగ్రత్తగా పరిశీలించాలి. రిజర్వేషన్ల వల్లనే తమకు కాలేజీలలో సీట్లు రావటం లేదనే అభిప్రాయం చాలామంది ఇతర తరగతులకు చెందిన యువ కుల్లో ఉంది. అదే విధంగా రిజర్వేషన్లు ఉంటే తమకు ఉద్యోగాలు వస్తాయని, చదువుకోడానికి అవకాశం ఉంటుందనే భావం వెనుకబడ్డ తరగతుల యువకుల్లో ఉంది. కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ రెండూ తప్పుడు చైతన్యానికి రూపాలే నని తెలుస్తుంది. ఉదాహరణకు రెండు కోట్ల ముప్పై లక్షల నిరుద్యోగుల సమస్యకు రిజర్వేషన్లు కారణం కాదు, పరిష్కారమూ కాదు. రిజర్వేషన్ల ద్వారా వెనుకబడ్డ తరగతుల వారందరికీ ఉద్యోగాలు రావు. అదే విధంగా ఇతర తరగతుల వారి ఉద్యోగులు రాకపోవడానికి రిజర్వేషన్లు కారణం కావు. అయితే కొద్ది మంది వ్యక్తుల విషయంలో రిజర్వేషన్లు కారణం కావచ్చు, పరిష్కారం కావచ్చు. కాని సామాజిక సమస్య విషయంలో ఇది కారణం కాదు, పరిష్కారం కాదు. ఇంకా స్పష్టమైన ఉదాహరణ కావాలంటే 1985 లో ఆంధ్రప్రదేశ్‌లో ఇంజనీరింగ్, మెడిసిన్‌లో సుమారు 50 వేల మంది ఎంట్రన్స్ పరీక్ష రాశారు. మొత్తం ఈ రెండు కోర్సులలో 3500 (1500 మెడిసన్, 2000 ఇంజనీరింగ్) సీట్లు మాత్రమే ఉన్నాయి. అంటే 50 వేల మందిలో రిజర్వేషన్లు ఉన్నా, లేక పోయినా 3,500 మందికి మాత్రమే సీట్లు వస్తాయి. అయితే సీట్లు రాని అగ్ర కులాల విద్యార్థులలో రిజర్వేషను వల్ల సీట్లు రాలేదనే భావం ఉంది. కాని ఇది వాస్తవం కాదు.

ఈ వాద ప్రతివాదనలు రిజర్వేషన్ల ఉద్యమ స్వభావాన్ని అర్థంచేసుకో డానికి ఉపయోగ పడుతాయనే ఉద్దేశంలో కొంత వివరంగా చర్చించడం జరి గింది. నేడు రిజర్వేషన్లను వ్యతిరేకించే వాదనల కంటే వాటి ప్రాతిపదికలను మార్చాలనే వాదన ఎక్కువగా కన్పడుతుంది. రాజ్యాంగంలో విద్యా, సామాజిక రంగాలలో వెనుకబడ్డ వర్గాలకు రిజర్వేషన్ల సౌకర్యం కల్పించాలని నిర్దే శించారు. అయితే విద్యా, సామాజిక రంగాలలో వెనుకబడిన తనాన్ని ఏ విధంగా నిర్ణయించాలనేది వివాదాస్పదమయిన విషయమయింది. ఇంతవరకు ఈ విషయాలు కులం ఆధారంగా నిర్ణయిస్తున్నాము. అందుకే కులం ఆధారంగా రిజర్వేషన్ సౌకర్యాలు కల్పించబడ్డాయి. కులవ్యవస్థకు భారతీయ సమాజంలో

ప్రత్యేకమైన స్థానం ఉంది .అందుకే కులస్థాయి సామాజిక స్థాయిని ప్రతిబింబి స్తుందని, కులం ఆధారంగా రిజర్వేషన్ ఇవ్వడం, వెనుకబడ్డ ప్రజలను ఇతరు లతో సమానంగా తీసుకురావడానికి ఉద్దేశించినదని చెబుతున్నారు. అయితే ఈ ప్రాతిపదిక నేడు తీవ్ర విమర్శకు గురవుతోంది. రిజర్వేషన్ సౌకర్యం పేద వారి కోసం ఉద్దేశించింది. కాబట్టి ఆర్థిక ప్రాతిపదికపై ఈ సౌకర్యంకల్పించాలని చాలామంది వాదిస్తున్నారు. ఒక కులంలో అందరూ వెనుకబడ్డ వారు కాక పోవచ్చు, కాబట్టి, ఏ కులానికి చెందినప్పటికి ఆర్థికంగా వెనుకబడ్డ వారందరికి రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలని వాదిస్తున్నారు. ఈ వాదన చాలా హేతు బద్ధమయిన వాదన. అయితే ఆచరణలో కొన్ని ఇబ్బందులు ఉన్న విషయాన్ని గుర్తించాలి. ఆర్థికపరమైన వెనుకబాటు తనాన్ని నిర్ణయించడం చాలా కష్టం. దీనిలో అవకతవకలకు చాలా అవకాశం ఉంది. దీనివల్ల రిజర్వేషన్ సౌకర్యాలు సంపన్నులు పొందడానికి అవకాశాలు ఇంకా ఎక్కువ అవుతాయి. భారతదేశం లాంటి వ్యవసాయ సమాజాలలో అసంఘటిత ఆర్థిక వ్యవస్థలలో ఏ కొద్దిమంది ఉద్యోగుల విషయంలోనో తప్పితే మిగిలిన వారందరి ఆదాయాన్ని లెక్కించడం చాలా కష్టమయిన విషయం. ఇన్ని పరిమితులున్నప్పటికి ఆర్థిక పరమైన ప్రాతి పదిక రిజర్వేషన్ సౌకర్యాలు పేదవారికి కలగడానికి ఇప్పుడున్న పద్ధతిలో కంటే ఎక్కువ అవకాశాలను కల్పిస్తుంది. అయితే కులాన్ని మౌలిక ప్రాతి పదిక చేసుకొని, ఆర్థిక ప్రాతిపదికను ప్రవేశపెట్టినట్లయితే, అంటే కులాన్ని ఆర్థిక పరిస్థితిని ఆధారంగా (Cast cum means) రిజర్వేషన్ల పద్ధతిని ప్రవేశ పెట్టినట్లయితే రిజర్వేషన్ల వల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందని చాలా మంది భావిస్తున్నారు. సుప్రీంకోర్టు కూడా ఈ మధ్య ఇదే అభిప్రాయాన్ని వెలి బుచ్చింది.

అయితే ఇది వాదనే కాని ఆందోళనకు పునాది మాత్రం ఇంతవరకు కాలేదు. రిజర్వేషన్ సమస్య చుట్టూ వచ్చిన ఆందోళనలన్నీ కొన్ని కులాలకు రిజర్వేషన్లు పెంచాలని నడిచినవే. వాద ప్రతిపాదనలు దేశమంతా కన్పించినా ఆందోళనలు మాత్రం కొన్ని ప్రాంతాలకే పరిమితం కావడం మనం గుర్తిం చాలి. కుల, కులవ్యతిరేక ఆందోళనలు ఇంతవరకు జాతీయ స్థాయిలో ఎన్నడూ జరగలేదు. జరిగే అవకాశం కూడా ఉన్నట్లు తోచదు. విచిత్రంగా కన్పించే ఈ విషయాన్ని కొంచెం లోతుగా పరిశీలిస్తే అసలీ ఆందోళనల సామాజిక స్వభావం స్పష్టమవుతుంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశంలో అంచెలంచెలుగా ప్రవేశించారు. కొన్నిచోట్ల ప్రత్యక్ష పాలన స్థాపిస్తే, మరికొన్నిచోట్ల పరోక్షంగా పాలించారు.

ఆ దశలో వచ్చిన కుల సంబంధ ఆందోళనలన్నీ బ్రిటిష్ పాలిత ప్రాంతాలలో తప్ప సంస్థానాలలో వచ్చినట్లు దాఖలాలు లేవు. వివిధ దశలలో బ్రిటిష్‌వాళ్ళు ఆయా ప్రాంతాలలో ఆర్థిక వ్యవస్థలో మార్పులను తీసుకువచ్చారు. పెట్టుబడి, సాంకేతిక అభివృద్ధి, ప్రభుత్వ సర్వీసులు, ఇతర సర్వీసులు, వివిధ ప్రాంతాలలో వివిధ స్థాయిల మేరకు ప్రవేశించాయి. ఈ మార్పులు సంస్కృతి, కులం, మతం, భాష, ఆచార వ్యవహారాలలో కూడా మార్పులను తీసుకువచ్చాయి. అప్పటిదాకా ఉన్న సాంఘిక సందర్భాలలో అంతర్లీనమై ఉన్న వైరుధ్యాలలో కూడా మార్పు వచ్చింది. తీవ్రత పెరిగింది. కులం, తెగ ప్రాతిపదికగా జరిగిన ఆందోళనలలో ఈ తేడాలు స్పష్టంగా ప్రతిఫలించాయి.

బ్రిటిష్‌వారు ప్రవేశించిన ఛోటా నాగపూర్ గిరిజన ప్రాంతాలలో గిరిజనేతర వ్యతిరేక ఆందోళనలు జరిగితే, వాళ్ళ ప్రభావం అంతగా లేని ఆదిలాబాద్ అడవుల్లో ఆ రకం ఉద్యమాలు లేవు. ఆనకట్టలు వచ్చిన ఆంధ్రా ప్రాంతంలో బ్రాహ్మణేతర ఉద్యమాలు వస్తే, ఆ మార్పులు లేని ఇతర ప్రాంతాలలో ఆ రకం ఉద్యమాలు లేవు. విభిన్న ఆందోళనల వెనకాల ఆ ప్రాంతాల ఆర్థికాభివృద్ధి క్రమం ఉంది. ఈ దృక్పథం నుండి సామాజిక చరిత్రను చెప్పడం ఈ వ్యాసం పరిధిలో సాధ్యంకాదు కాని, ఇక్కడ మనం గమనించాల్సిన విషయం ఒకటుంది. స్వతంత్ర భారతదేశంలో కూడా ఇదే పరిస్థితి కొనసాగుతోంది.

సరుకుల ఉత్పత్తి, పెట్టుబడి, సాంకేతికాభివృద్ధి, తరతమ స్థాయిలలో సాంఘిక సంబంధాలలో తీసుకువచ్చిన మార్పులు, తీవ్రం చేసిన వైరుధ్యాలే వివిధ ప్రాంతాలలో, వివిధ రూపాలలో ప్రతిఫలిస్తున్నాయి. మరట్వాడాలో విశ్వవిద్యాలయానికి అంబేద్కర్ పేరు పెట్టినందుకు ఆ ప్రాంతమంతా చెలరేగిన దళితుల మారణకాండ, గుజరాత్‌లో వెనుకబడిన కులాలకు రిజర్వేషన్ శాతం పెరిగితే ముస్లింల, దళితుల ఊచకోత, ఉత్తర బీహార్‌లో వెనుకబడిన కులాలకి, దళితులకి జరుగుతున్న హింసాయుత సంఘర్షణలు, పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో దళితులపై అగ్రకులాల అత్యాచారాలు, హర్యానాలో జాట్ రైతాంగం, ఆంధ్రాలో కమ్మ రైతాంగ దురహంకారం- ఇలా వివిధ ప్రాంతాలలో వివిధ రూపాలలో సాగుతోంది. కొన్నిచోట్ల వెనుకబడిన కులాలు, దళితులు కలిస్తే మరికొన్ని చోట్ల వాళ్ళు సంఘర్షణలో ఉన్నారు. వివిధ రూపాలను తీసుకుంటున్న సామాజిక సంఘర్షణలకు మన దేశ ఆర్థికాభివృద్ధిక్రమమే ప్రాతిపదిక. ఈ ఆర్థికాభివృద్ధిక్రమంలో కులం, పెట్టుబడి ముడిపడి ఉన్నాయని ఎ. కె. రాయ్ చక్కగా చెప్పారు. వెనుకబడ్డ దేశం పెట్టుబడిదారీ పంథాను అనుసరించ

సమీక్షా వ్యాసం :

# దళిత కథలు

ఒక సామాన్య వ్యక్తి తన జీవిత కాలంలో కష్టపడి పనిచేసి కాస్త డబ్బు నిల్వచేసుకుని యిల్లు కట్టుకుందామనుకోవటం అత్యాశా కాదు, దురాశా కాదు. సరిపోను డబ్బు నిల్వ చేసుకుంటే ఆ కోరిక తీర్చుకోవటం అసాధ్యం కూడా కాదు. అసాధ్యం కాదనే మనందరం అనుకుంటాం. కానీ ఆ వ్యక్తి దళితవర్గానికి చెందినవాడైతే తను పుట్టిన గ్రామంలో ఆ యిల్లు కట్టుకుందామనుకుంటే ఆ కోరిక అసాధ్యమైనదే ఔతుంది. గ్రామాలలో బలంగా వున్న అగ్రవర్ణ దురహంకారం ఆ దళిత వ్యక్తి యింటికీ ఆ యింటిగురించి అతను కన్న కలలకూ చివరకు ఆ వ్యక్తికే నిప్పు పెట్టేస్తుంది.

నువ్వు పట్టణానికి వెళ్ళి రెక్కలు ముక్కలు చేసుకుని అరవయ్యేళ్ళకు రెండు వేల రూపాయలు సంపాదించుకున్నావే అనుకో- ఆ రెండు వేలూ చూసుకుని గ్రామంలో అందరి కంటే పెద్ద యిల్లు- రెండంతస్థులు వుండేట్లుగా కట్టుకుంటావా ?.

'నువ్వు- అంటరానివాడివి- అధముడివి- మా సరసనే- మాతో సమానమంటూ- మా యింటి కన్న చక్కని యిల్లు కట్టుకుంటావా?' ఈ దురహంకారంలోనే బయాజీ కట్టుకున్న యింటిని గృహప్రవేశం నాడే కోండిబా పాటిల్ తగల బెట్టించాడు (రెండంస్థుల యిల్లు) బయాజీ ఆ యింటితో పాటు కాలి పోయాడు. ఒక తరం తన కోరిక తీరకుండానే మరణించింది. తరువాతి తరం-

---

డానికి ప్రయత్నిస్తున్నపుడు ఫ్యూడల్ భావాలను, వ్యవస్థలను కూడా ఉపయోగించుకోవడం జరుగుతుంది. అరువు తెచ్చుకున్న పెట్టుబడిదారీ పద్ధతులు కుల వ్యవస్థకు నూతన రూపాన్ని, జీవాన్ని ఇస్తున్నాయి తప్పుడు చైతన్యాన్ని పోషిస్తున్నాయి. దేశ ఆర్థికాభివృద్ధిక్రమాన్ని ప్రజలందరికి అర్థమయ్యేటట్లు చెయ్యడంలో తప్పుడు చైతన్యం పెద్ద అవరోధంగా ఉంది.

ఆ తప్పుడు చైతన్యం నుంచి ప్రజలు విముక్తి అయ్యేదాకా ఏంచేయాలి ? ప్రతి ఆందోళనలోను, సంఘర్షణలలోను ఎవరు మారణకాండకు గురి అవుతున్నారో వారిని సమర్థించాలి.

—వి. ఎస్.

బయాజీ కొడుకులు- తండ్రి కోరిక తీర్చటానికి నడుం కట్టుకున్నారు. ఈ తరం కలలను నాశనం చెయ్యటం అగ్రవర్ణాల వారి కంత తేలిక కాదు. ఈ తరం తమ కోర్కెల సాధనకు పోరాడుతుంది. అగ్రవర్ణ దురహంకారాన్ని యెదిరించి నిలబడటానికీ ఆత్మగౌరవం కాపాడుకోటానికీ, స్వేచ్ఛగా బతకటానికీ తన సర్వశక్తులతోనూ తెగించి పోరాటం చేస్తుంది. ఆ పోరాటం దళిత పోరాటమైతే ఆ పోరాటాన్ని ఉత్తేజకరంగా చిత్రించే సాహిత్యం దళిత సాహిత్యం ఔతుంది. మొత్తం పీడితులంతా తమ విముక్తి కోసం చేసే పోరాటం విప్లవోద్యమమైతే ఆ విప్లవాన్ని ప్రతిబింబించే సాహిత్యం విప్లవ సాహిత్య మవుతుంది. ఆ రకంగా దళిత సాహిత్యం విప్లవ సాహిత్యంలో ఒక భాగమే.

హైదరాబాదు బుక్ ట్రస్టు వారు ప్రచురించిన 'దళిత కథలు' మహారాష్ట్రలో బలంగా వున్న దళిత ఉద్యమాన్నీ, దళిత సాహిత్యోద్యమాన్ని తెలుగు వారికి పరిచయం చేస్తాయి. ఈ పుస్తకంలో 9 అనువాద కథలూ, దళిత సాహిత్యోద్యమం గురించిన పరిచయం ఉన్నాయి. మరాఠీ భాషలో వెలువడిన కథల సంకలనానికి డా॥ సూర్యనారాయణ రణసుభే, డా॥ కమలాకర గంగావణే పరిచయం రాశారు. ఆ పరిచయాన్ని తెలుగులోకి నిఖిలేశ్వర్ అనువాదం చేశారు. అయితే ఆ మరాఠీ పుస్తంలోని కథలన్నీ ఈ తెలుగు పుస్తకంలో వున్నట్టు లేవు. ముందు దళిత సాహిత్యోద్యమం గురించి రాసిన పరిచయాన్ని చదివి ఆ తర్వాత కథలు చదవటం వల్ల పాఠకులకు దళిత సాహిత్య పూర్వాపరాలు బాగా అర్థమవుతాయని ప్రచురణ కర్తల అభిప్రాయం.

దళిత సాహిత్యం అంటే యేమిటి అన్న ప్రశ్నకు ఆ ఉద్యమంలోనే రెండు రకాల సమాధానాలు ఉన్నాయి. దళితుల గురించి రాసినదంతా దళిత సాహిత్యమే అనే వారు కొందరు. వీళ్ళు మార్క్సిజాన్ని నమ్మే వారు. దళితుల కథలు దళితులు రాస్తేనే అది దళిత సాహిత్యమనేవారు కొందరు. వీరు తీవ్ర అంబేద్కర్ వాదులని పరిచయంలో పేర్కొన్నారు. వీళ్ళ భావాలు ఆశ్చర్యకరంగా అనిపిస్తాయి. సమాజంలోని అసమానతలనూ దోపిడీనీ గుర్తించి అనుభూతి చెంది ఆ అనుభూతిని సాహిత్య రూపంలో చెప్పినవాళ్ళు దళితులు కాకపోతే వాళ్ళది దళిత సాహిత్యం కాదన్న మాట. దళితుల బాధలను దళితులు బాగా రాయగలరనటం వేరు. దళితుల బాధలను దళితులు మాత్రమే బాగా రాయగలరు. వాళ్ళు రాసింది మాత్రమే దళిత సాహిత్యం అనటం సాహిత్యంలో కొత్త రకం అంటరాని తనాన్ని సృష్టించటమే ఔతుంది.

స్త్రీలను గురించి చలం రాసిన రచనలో పీడితుల గురించి శ్రీశ్రీ రాసిన రచనలో దళితుల గురించి కాళీపట్నం రామారావు గారు రాసిన కథలో యివన్నీ సెకెండ్ హాండ్ సాహిత్య మవుతుందన్న మాట.

తీవ్ర అంబేద్కర్ వాదుల అభిప్రాయాలు పరిశీలిస్తే దళిత సాహిత్యాన్ని మిగిలిన విప్లవ సాహిత్య నుండి వేరు చేయటానికి అనాలోచితంగా చేసే ప్రయత్నమా ఈ విభజన అనిపిస్తుంది. ఇక్కడ కొంచెం సాహిత్య పరిధిని దాటి దళిత ఉద్యమంలోకి తొంగి చూసి ఆ ఉద్యమ సారాంశాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నించటం అనుచితం కాదనుకుంటాను. ఆ ప్రయత్నం కూడా ఈ పుస్తకంలోని 'పరిచయం' ఆధారంగానే గోవిందరావ్ పూలే (1827-1890)తో మొదలైన ఈ దళిత ఉద్యమం దళితుల బాధలను ప్రధానంగా సాంఘిక సమస్యలుగా మాత్రమే తీసుకుని ఆ సాంఘిక సంస్కరణల కోసం మాత్రమే పని చేసినట్లు కనిపిస్తుంది. ఈ దళిత ఉద్యమ నాయకులలో ప్రముఖుడైన అంబేద్కర్ బౌద్ధమతాన్ని స్వీకరించాడు. ఆ మత సిద్ధాంతాలకు కొత్త భాష్యం సమకూర్చి వాటి ద్వారా హిందూ మతాన్నీ, ఆ మతంలోని భయంకర ఆచారాన్నీ, ఆ మతం ప్రచారం చేసే అసమానతలను ఎదుర్కోదల్చుకున్నాడు. అంటే హిందూ మతం ఎక్కడ నుంచి ఏ ప్రయోజనాన్ని కాపాడటం కోసం పుట్టిందో ఆ పునాదిపై కాకుండా ఆ పునాదిని కాపాడటం కోసం నిలబడిన ఒక శక్తి మీద యుద్ధం చేస్తున్నాడు. అగ్రవర్ణాల చేతిలో భూమినీ అధికారాన్నీ కేంద్రీకరించి కాపాడటం కోసం హిందూ మతం యేర్పడింది. ఈ భూమి సంబంధాల విషయం నుంచి పీడితుల దృష్టిని మళ్ళించి మొత్తం విషయాన్ని ఒక మిస్టిఫికేషన్‌కు గురి చెయ్యటమే హిందూ మతం యొక్క ప్రయోజనం. దానిని మిస్టిఫికేషన్‌ను గుర్తించకుండా దానితో పోరాడటానికి యింకొక మిస్టిఫికేషన్‌ను ఆశ్రయిస్తే జరిగేది 'నీడతో యుద్ధం' మాత్రమే.

దళిత ఉద్యమంలో యివాళ మార్క్సిజంను నమ్మేవారు మార్క్సిజంను కాదనేవారు కూడా ఉన్నారని 'పరిచయంలో'లో చెప్పారు. మార్క్సిజంను నమ్మనివాళ్ళు అంబేద్కర్ భావాలను మాత్రమే స్వీకరిస్తారట. "భారతదేశంలో సవర్ణులు మార్క్సును తమ స్వార్థానికి ఉపయోగించుకున్నారు కాబట్టి ఈ దేశంలో మార్క్స్ నిరుపయోగమయ్యాడని వీళ్ళ నమ్మకం".

ఈ వాక్యాన్ని పరిశీలిస్తే మార్క్సిజం మంచిదే గాని దానిని సవర్ణులు తమ స్వారానికి వాడుకున్నారు గనుక దళితులకు పనికి రాదనేది వీళ్ళ అభి

ప్రాయంగా కనపడుతుంది. నిజంగా మార్క్సిజం సరైనదైతే దానిని సవర్ణుల స్వార్థానికి ఉపయోగపడకుండా తమ చేతుల్లోకి తీసుకోవటం దళితుల కర్తవ్యం. ఒక పసునైన ఆయుధాన్ని శత్రువు చేతిలోంచి లాక్కోకుండా శత్రువు కల్పించే మతం మాయనే ఆశ్రయిస్తే లాభమేముంది ?.

దళిత సాహిత్యోద్యమం ఈ సంకుచిత పరిధిని దాటి విప్లవ సాహిత్యోద్యమంలో భాగం కావాలి. దళిత సంఘాలూ,దళిత రచయితల సంఘాలు ఆయా పరిస్థితులనూ, అవసరాలనూ బట్టి యేర్పడటం మంచిదే కాని అవి విప్లవోద్యమానికి దూరంగా విప్లవోద్యమం నుంచి వేరుబడి వుండటం పీడిత ప్రజలకు చాలా నష్టం.

ఈ పరిచయంలో ఈ సంపుటిలోని కథా రచయితలను గురించీ, దళిత సాహిత్యోద్యమం గురించీ చెప్పిన మాటలు కొన్ని చాలా అస్పష్టంగా సందేహాల్ని కలిగించేటట్లు ఉన్నాయి. ఈ కథకులను గురించి చెబుతూ "ఏదో కోపాన్నీ ప్రచారాన్నీ, అంబేద్కర్ తత్వాన్ని తమ కథల్లో ప్రతిఫలింప చెయాలని వీళ్ళు ప్రయత్నించలేదు. తటస్థులైన పరిశీలకులుగా దళిత మానసిక తత్వాన్ని తమ కథల్లో ప్రతిఫలింప చేయాలని ప్రయత్నించారు". ఇది చాలా వింతగా వుంది. 'ఈ సామాజిక వ్యవస్థకు విరుద్ధంగా దళితులు నిరంతరం తిరుగుబాటు చేయవలసి వుంది. ఈ తిరుగుబాటు చరిత్రయే దళిత సాహిత్యం' - అని యింకో చోట రాశారు. తిరుగుబాటు చరిత్రే దళిత సాహిత్యమయితే తటస్థంగా వుండటం యెట్లా కుదురుతుంది ? అసమానతల పట్ల కోపం తమను విముక్తం చేస్తుందని తాము నమ్మిన సిద్ధాంత ప్రచారం లేకుండా దళిత సాహిత్యం తిరుగుబాటుని యెట్లా ప్రతిఫలిస్తుంది ?.

ఈ దళిత సాహిత్యం గురించి వివరిస్తూ చెప్పిన నాలుగు పాయింట్లలో మొదటి పాయింటు దళితులకు కాదుకదా వేద పండితులకు కూడా కొరుకుడు పడేలా లేదు.

"ఈ సాహిత్యం తిరుగుబాటు సమాజం యొక్క విస్పష్టతకు సౌకర్యాలు కలుగ జేస్తుంది. ఆత్మా విష్కారముతో పాటు, తిరుగుబాటు సమాజం యొక్క ఆత్మ పరివర్తనను ప్రోత్సహిస్తోంది. దీని సృజన రెండు వర్గాల కోసం జరిగేదే" ఈ రకమైన అయోమయమైన గందరగోళమైన భాష నుండి కనీసం దళిత సాహిత్యమైనా బైట పడాలి.

ఇక కథలలోకి వెళ్ళి పరిశీలిస్తే - దళిత వర్గాలకు మేలు చేస్తామని వచ్చి వారిని దోపిడీ చేసే అధికారులను 'ఆక్రోశం' కథలో బైటా పెట్టారు. అంటరాని తనం నిషేధించబడినా అగ్రవార్ణాలు దానిని పాటిస్తూనే వున్నారు. మారిన పరిస్థితుల కనుగుణంగా తమ పద్ధతులు మార్చుకుంటున్నారు అనే విషయం ఈ కథలో బాగా వచ్చింది. చిన్న తనంలో బ్రాహ్మణుల బావిలో మంచి నీళ్ళు తాగినందుకు హరిజన బాలుడిని చచ్చేట్టు కొట్టించిన బ్రాహ్మణ పిల్లవాడే పెద్ద వాడయ్యాక ఆఫీసరై సహపంక్తి భోజనాలు యేర్పాటు చేస్తాడు. ఐతే ఈ భోజనాల్లో బ్రాహ్మణులంతా ఒక చోటా, దళితులంతా ఒక చోటా కూర్చునేలా యేర్పాటు చేస్తారు. దానిని గుర్తించి ప్రశ్నించిన గుణవంత్‌ని అవమానించి పంపుతారు.

'జ్వాలా వలయాలు' అనే కథలో భూమి విషయంలో ఒక గ్రామంలోని దళితులకూ భూస్వాములకూ పోరాటం జరుగుతుంది. దళితులు ముకుంద్ నాయకత్వాన సంపాదించుకున్న భూమి తమదని భూస్వాములు దాడి చేస్తారు. దళితుల్ని కొట్టి వాళ్ళ గుడిసెల్ని తగల బెడతారు. దళితులు ఆ వూరు మాదిరి పోరాటానికి సిద్ధపడతారు. వాళ్ళకు భూమి రావటం కోసం కృషి చేసిన వాళ్ళ నాయకుడు ముకుంద్ అంటాడు

"ఇక్కడెందుకుండాలి మనం"
"మరెక్కడి కెళ్తాం" ఎవరో అడిగారు
దూరంగా వెళ్ళిపోదాం....
ఎక్కడైతే మనల్ని మాలలనీ, మాదిగలనీ
అసహ్యించుకోరో—
ఎక్కడైతే మన బతుకులు
అగ్గిపాలు కాకుండా వుంటాయో—
అక్కడికే పోదాం.

హింస, దుర్మార్గం, దురన్యాయం లేని చోటికి వెళ్ళి పోదాం" అంటూ బయల్దేరతారు. ఎక్కడ ఆ చోటు ?— ఈ ప్రపంచంలో యెక్కడైనా అట్లాంటి చోటు వుందా ? ఆర్యులకూ అనార్యులకూ పోరు జరిగిన దక్షిణం వైపుకు ఆ ప్రజలు నడుస్తున్నారనటంతో కథ ముగుస్తుంది.

కానీ దక్షిణాన కారంచేడు వుందే. కారంచేడు హరిజనులు మేం కారంచేడులో వుండం అని కారంచేడు నుంచి బైటికి వచ్చి నెలల తరబడి ప్రవాస జీవితం గడుపుతున్నారే—

ఎక్కడ దళితుల స్వర్గం
ఎక్కడ దళితులకు స్వేచ్ఛగా ఆత్మగౌరవంతో బలికేది—

ఎక్కడ దళితులు దోపిడీకి గురికానిది?
దళితుల వధ జరగని చోటు
భారతదేశమంతా వెదికినా దొరకదు.

అసలు దళితులు తాము పుట్టిన గడ్డను వొదిలి ఎక్కడికో వెళ్ళటం వాళ్ళ సమస్యలకు పరిష్కారమా?

తాము నిలబడిన చోట తన కాళ్ళ కింది భూమి కోసం పోరాడటం పరిష్కారమా?

'జ్వాలా వలయాలు' కథ ఈ ఆలోచనను రేకెత్తిస్తుంది.

దళితులలోనే కొందరు తమ వర్గం వారినే దోపిడీ చేసి లాభపడిన సందర్భాలున్నాయి. అటువంటి సంఘటనను 'పరాన్న భుక్కులు' కథ చిత్రించింది.

'వల' అనే కథలో హరిబా ఊరి పెద్దల ఆట కట్టిస్తాడు. ఊరి పెద్దలు మాదిగలను వెలివేసి వారి పశువులకు మేత కూడా లేకుండా చేస్తే హరిబా తాను మోదుగ చట్టును వేలం పాటలో పాడి ఆ భూమిలోకి గ్రామస్థుల పశువుల మందలను రాకుండా చేస్తాడు. ఊరి పెద్దలు లొంగి వస్తారు. "గ్రామం లేనిదే గూడానికి అందం లేదు. గూడెం లేనిదే గ్రామానికి గౌరవం లేదు. ఈ గ్రామానికి చెందిన భూమి మనందరిదీ. అందరం ఒక తల్లిబిడ్డల్లాగా వుండాలి" అంటాడు పటేల్.

"అదెట్లా— అలాగే అనుకుంటే గ్రామస్థులు మా మాదిగల చుట్టూ ఈ వలపన్నేవాళ్ళు కాదు" అంటాడు హరిబా.

పటేల్ ఆ వల తెంచి పారేస్తామనీ మనుషుల పట్ల మనుషుల్లాగా ప్రవర్తిస్తామనీ హామీ యివ్వటంతో కథ పూర్తవుతుంది.

మనుషుల పట్ల మనుషుల్లా వ్యవహరిస్తానన్న పటేల్ మాట అతని మనసు లోంచి వచ్చిందేనా? గత్యంతరం లేక అలా అన్నడా ఇది కొత్త వల అల్లికకు ప్రారంభమేమో ఈ సందేహాలు హరిబాకు వచ్చినట్లు రచయిత రాసివుంటే బాగుండేది. హరిబా ఆ మాటలు విని చల్లని నిట్టూర్పు విడిచి భారం తీరినట్లు నిశ్చింత వహించటం యింకో మోసానికి అందుడు కావటం కాదా?

'చేదు బతుకులు' కథ దొర ఎక్కిన బండికి ముందు పరిగెత్తి పరిగెత్తి ఆయాసంతో చచ్చిపోయిన వృద్ధుడి దయనీయమైన కథ.

'తగువు' అనే కథలో తుమ్మచెట్లు నరికి నందుకు గాను అగ్రవర్ణాల వారు హరిజన దంపతు లిద్దర్ని హింసిస్తారు. తన తల్లి తండ్రులనుభవించే హింసను చూసిన చిన్న పిల్లాడి వైపు నుంచీ ఈ కథనం సాగుతుంది. నిజానికి

సమాజంలోని అసమానతలను నగ్నంగా చూపించటానికి చిన్న పిల్లాడి దృష్టి నుంచీ కథ చెప్పటం యెంతో మంచి పద్ధతి. కానీ ఈ రచయిత ఆ పద్ధతినంత బాగా ఉపయోగించుకోలేదనిపించింది. ఒకోసారి పిల్లవాడి వయసుకు మించిన ఆలోచనలు రాశారు. అది రచయిత రాసినట్లుగా కథ నడిస్తే బాగుండేది. తెలుగులో యిటువంటి ప్రయత్నం కుటుంబరావు గారు చాలా విజయవంతంగా చేశారు. 'తాతయ్య' అన్న కథలో ఓ బ్రాహ్మణ బాలుడి ఆలోచనల ద్వారా సమాజంలోని అసమానతలనూ, వైరుధ్యాలనూ అద్భుతంగా చెప్పారు. 'తగువు' కూడా అటువంటి ప్రయత్నమే కాని రచయిత విఫలమయ్యాడు.

ఈ రచనల గురించి ఒక అభిప్రాయం చెప్పాలంటే— ఈ కథలన్నీ దళిత వర్గాల బాధలను వర్ణించి పాఠకుల మనసుల్లో కరుణనూ మానవత్వాన్నీ మేల్కొల్పజూసే కథలు. దళితులంటే జాలిని కలిగించే కథలు. ఈ కథలు చదువుతుంటే కసి పుట్టుకురావటం లేదు. సమాజాన్ని గురించి కొత్త జ్ఞానమేదో పొందిన అనుభూతి కలగటం లేదు.

ఈ సంపుటిలోని కథలు సంస్కరణవాద స్థాయి నుంచి అభివృద్ధి చెందినవి కావేమో ననిపిస్తోంది. దళిత ఉద్యమం సంస్కరణవాద స్థాయినుంచి పోరాట స్థాయికి పెరిగింది. కానీ ఆ పోరాట స్థాయిని ప్రతిఫలించే కథలు ఈ సంపుటిలో లేవు. అటువంటి కథలు లేకపోతే దళితుల పోరాటం గురించి మనకు తెలియదు. దళిత కథలను ప్రత్యేకంగా వేసినప్పుడు— ఈ కథల ద్వారా తెలుగువారికి మరాఠీ దళిత సాహిత్యాన్ని పరిచయం చేసేటప్పుడు— అటువంటి పోరాట కథలను వెయ్యకపోవటం ప్రచురణకర్తల లోపం. 'పరిచయం' లో పోరాటం దిశగా దళిత సాహిత్యాన్ని నడిపించాడని చెప్పిన బాబూరావ్ వాగుల్ కథ యిందులో లేదు. దళిత స్త్రీల జీవితాల్లోని భయంకరత్వాన్ని చిత్రించారని చెప్పిన భీమ్‌రావ్ శిర్వాలే, అమితాబ్, సుభిరార్ హివరాలె, అవినాశ్ డోలస్ లాంటి రచయితల కథలు కూడా యిందులో లేవు. అంటే దళిత సాహిత్యం లోని వర్తమానపు అత్యుత్తమ కథల సంపుటి యిది అని చెప్పలేము.

హైదరాబాద్ బుక్ ట్రస్టువారు దళిత సాహిత్యాన్ని పరిచయం చేసినందుకు అభినందనీయులే. కాని దళిత పోరాట సాహిత్యానికి ప్రాతినిధ్యం ఇస్తూ మరో దళిత కథల సంపుటి వేసి, ఈ సంపుటి రేకెత్తించిన ఆశను తీర్చినప్పుడే ఈ సంపుటికి, దళితుల పోరాటానికి పరిపూర్ణత ఏర్పడుతుంది.

— ఓల్గా

రాష్ట్రంలోనూ వరంగల్ లోనూ నెలకొని ఉన్న భయంకర నిర్బంధ వాతావరణం సృజన మనుగడకి ఒక సవాల్ అయింది. సృజన చరిత్రలో మొదటిసారిగా మూడు సంచికలు కలిపి ఒక్క సంచికగా (జులై - సెప్టెంబర్, 165-167) ప్రచురించాల్సి వచ్చింది. అక్టోబర్ సంచిక ఆలస్యంగా మీ చేతికి అందుతున్నది. ముద్రణ సమస్యలే ఇందుకు ప్రధాన కారణం. ఐతే నిర్బంధం సృష్టించిన ఈ సమస్యలను అధిగమించడానికి తగిన ఆర్థిక సహాయం లేకపోతే సృజన ప్రచురణ మరింత కష్టసాధ్యమవుతుంది. అందుకే సృజన కొనసాగాలని కోరుకునే వాళ్ళందరినీ చందాల ద్వారానూ విరాళాల ద్వారానూ చేయూతనిచ్చి సంఘీభావాన్ని ప్రకటించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

—సాహితీ మిత్రులు

**SRJANA Telugu Monthly** **October, 1985**

**Regd. No. with Registrar of Newspapers 10953/67** **H/HNK-3**

# అమరత్వం

— శివసాగర్

విత్తనం చనిపోతూ
పంటకు వాగ్దానం చేసింది
చిన్నారి పువ్వు రాలిపోతూ
చిరునవ్వుతో కాపును వాగ్దానం చేసింది

అడివి దహించుకుపోతూ
దావానలాన్ని వాగ్దానం చేసింది
సూర్యాస్తమయం చేతిలో చెయివేసి
సూర్యోదయాన్ని వాగ్దానం చేసింది

అమరత్వం రమణీయమైంది
అది కాలాన్ని కౌగిలించుకొని
మరో ప్రపంచాన్ని వాగ్దానం చేసింది.

(అమరులైన 'కామ్రేడ్స్-సూర్యుళ్ళ'కు అంకితం)